మనలో ఉన్న ప్రాణమే గంగ!
మనలో ఉన్న ప్రేమయే యమున!
మనలో ఉన్న మానవత్వమే సరస్వతి!...
ఈ త్రివేణీ సంగమంకన్న పవిత్రమైంది లేదు.

అసలుపేరు తెన్నేటి హేమలత. జన్మస్థలం వాసస్థలం కూడ విజయవాడే. ఎనిమిదవ ఏటనే కలం చేతబట్టారు. మోహనవంశి, వారిజ, పిచ్చివాళ్ళ స్వర్గం, తిరగబడ్డ దేవతలు, పథవిహీన మొదలైన నవలలేకాక ఊహాగానం మొదలైన సంపుటాలు మొత్తం నలభై అయిదుదాకా ప్రచురించారు.

గృహలక్ష్మి స్వర్ణకంకణం అందుకున్నారు

# మహానగరం

ఎమ్. శేషాచలం అండ్ కో
మచిలీపట్నం. మద్రాసు. సికింద్రాబాద్




36

MAHA NAGARAMLO STREE

By

LATA

Publishers :
M. Seshachalam & Co ,

First Edition :
January, 1969

Printers :
Kranti Press, Madras-1.

Cover design :

Bapu

Distributors :

ANDHRA PRADESH BOOK·DISTRIBUTORS;
RASHTRAPATHI ROAD, SECUNDERABAD

Rs. 2/-




66

# ఒక మాట

'మహానగరంలో స్త్రీ'ని ఇప్పటికి పూర్తిచేయగలగటం ఘనకార్యంగానే భావిస్తున్నాను. ఈ మధ్య వచ్చిన అనారోగ్యం వగైరాలతో సగం వ్రాసి ఆపేయక తప్పలేదు. అయినా ఇది అయినందుకు చాలా ఆనందంగానే ఉంది గాని శ్రీ బుచ్చిబాబు గారు చదవలేదే అని బాధగా ఉంది...కళాకారుల జీవితాలకన్నా వస్తువులు లేవని ఆయన అంటూవుండేవారు...ప్రస్తుత కళారంగాల్లో సినిమా గొప్పదీ, నలుగురికి పని చూపించేదీ కనుక దాన్నే కేంద్రంగా తీసుకుని నవల వ్రాస్తే బాగుంటుందని ఆయన నాతో రోజూ అంటూ ఉండేవారు.

సరే అని మొదలెట్టి సగం వ్రాసేదాకా ఎప్పటికప్పుడు వారికి వినిపిస్తూనే వచ్చాను...కళలు అవినీతికి మాత్రమే మూలం కాదు, అనురాగానికీ మానవత్వానికీ కూడా మూలం. అందులో కూడా విశృంఖలతా మాత్రమే కాదు, ఔన్నత్యమూ ఆర్ద్రతా కూడా ఉన్నాయి...అపర్చ్యూనిటీ మాత్రమే కాదు శాక్రిఫైస్ కూడా ఉంది—కళాకారులు చంచలులు కాదని నేను వాదించను గాని—

ఆ చాంచల్యమే వాళ్ళల్లో సౌందర్యం కూడా అని చెప్పగలను...కళారంగంలో ఉన్న మానవత్వానికీ మిత్రులైన కళాకారులకీ వందనాలు.

కళారంగంలో నటన, గానం, రచన అనే మూడు కళలూ కలిస్తే మహా పవిత్రమైన ప్రయాగలో ప్రవహిస్తున్న త్రివేణీ సంగమం అవుతుంది. ఆ ప్రవాహంలో పాపాలూ తప్పులూ చాపల్యాలూ కొట్టుకుపోయి ఒక్క పవిత్రతే మిగులుతుంది.

ఆ పవిత్రతకే తల వంగి పోతుంది.

అదే త్రివేణి...పాపాల మధ్య ఉంటూ పవిత్రంగా ఉండగలిగిన పుణ్యమూర్తి...అందుకే అంత ఆకర్షణీయంగా ఉంటారు కళాకారులు: భగవంతుడి తరువాత పూజింపబడతారు.

కోపంలో భగవంతుడిని తిట్టవచ్చును. కళాకారుల్ని విమర్శించవచ్చును. అంతమాత్రంచేత వారి గొప్పతనం తగ్గదు.

ఈశ్వరుడు —కళ—కళామూర్తి—ఈ ముగ్గురూ ఒకటే... ఈ విచిత్ర త్రివేణికి—

నా నమస్కారాలు—

వంశీకుంజం
విజయవాడ-3.

— లత

# అంకితం

మహానగర నివాసిని కళాకారిణి
అయిన అద్భుత శక్తి
స్త్రీ మూర్తికి

— లత

# 1

సావిత్రి జీవితం చాలా ఆశ్చర్యకరమైంది. ప్రకాశరావుగారి ఆశ్రమంలాంటి ఆఫీసులో ఆ అమ్మాయిని మొదటి సారిగా చూసినప్పుడే ఈ అమ్మాయి వెనకాల కొన్ని ఆశ్చర్యాలు ఉండవచ్చునని పించింది.

ఒక తడవ కాబోలు ఈ అమ్మాయిని తోడు తీసుకొని హైదరాబాద్ నగరంలో ఒక చోటికి వెళ్ళాల్సి వచ్చింది. అక్కడ అరుణాచలం కనిపించాడు. ఈ అమ్మాయీ అతనూ గుసగుసలాడుకొన్నారు. ఆ తరువాత ఆ అమ్మాయి చెప్పిన దాని సారాంశం ఏమిటంటే- అరుణాచలం నన్ను గురించి అడ్డమైన మాటలూ అన్నాడని.

అసలే అరుణాచలానికీ నాకూ పడదు గనుక అనేవుంటాడని నేనూ కాస్త భ్రమించాను. టెలిఫోను తీసి అరుణాచలం స్నేహితుడు రావుని పిలిచి అదే పనిగా నానా మాటలూ అని ఫోను పెట్టేశాను-కాని చివరకు తేలిందేమిటంటే అరుణాచలం నన్ను గురించి ఒక్కమాట కూడా అనలేదనీ, సావిత్రి చెప్పినదంతా పచ్చి అబద్ధమనీ. అసలే నా దృష్టికి పెద్ద ఆశ్చర్యార్థకంగా కనుపిస్తున్న సావిత్రి మరింత పెద్ద ఆశ్చర్యార్థకంగా కనుపించటం మొదలెట్టింది.

న్యాయానికి నాతో అబద్ధ మాడాల్సిన అవసరం లేదు ఆ అమ్మాయితో వున్న కొద్దిపాటి పరిచయంలో ఆ అమ్మాయితో చనువుగాకూడా లేను. కాకపోతే ప్రకాశరావుగారంటే గురుభావం ఉండటం వలన-అంతరాంతరాల్లో సావిత్రి అంటే ఏ మాత్రమో అభిమానం లేకపోలేదు.

అబద్ధాలాడటం మంచినీళ్ళ ప్రాయమని అప్పుడే తెలుసు కొన్నాను. బహుశా ఆదొక రకం జబ్బయి వుంటుంది. అరుణా చలం ఇదివరకు తనని అవమానించాడని సావిత్రి కేసు పెట్టింది. అప్పుడు అరుణాచలానికి శిక్షకూడా పడిందన్న విషయం అనంతరం నాకు తెలిసినప్పుడు నా మతి పూర్తిగా పోయింది.

అరుణాచలంకూడా అసమర్థుడుకాదు. తిరిగి అప్పీలుచేసి గెలిచాడు. ఆ తరువాత కోర్టులో తప్పుడుకేసు పెట్టించనీ, అబద్ధా లాడి న్యాయస్థానాన్ని పెడత్రోవ పట్టించిందనీ-ప్రభుత్వ న్యాయవాది ఆ అమ్మాయిమీద కేసుపెట్టాడు. సరిగ్గా ఇదే సమయంలో అరుణా చలం సావిత్రీ కలిసి సినిమాకి వెళ్ళటం చూసిన ప్రభుత్వ న్యాయవాది కేసుని వాయిదాలు వెయ్యక తప్పలేదు.

ఆ తరువాత పక్కింటి మరో అమ్మాయి అందంగా ఉందని అసూయ పట్టలేక ఆ అమ్మాయిని అకారణంగా బాదిగొట్టింది సావిత్రి. తిరిగి సావిత్రిమీద కేసువచ్చి అప్పుడు అరుణాచలం ఆమెను తప్పిం చాడు. అరుణాచలం నలభయి సంవత్సరాలవాడు; బొమ్మలు గీస్తాడు. చాలా ఆస్తిపరుడు- కట్టుకొన్న భార్యతో సర్దుకోలేక ఆమెకు విడాకులిచ్చాడు-కళాకారుడు కనక తన ఆశయాలకు అను గుణంగా ఒక ఇల్లు కట్టాడు హైదరాబాద్‌లో.

ప్రతి మనిషికీ తన ఊహలకు అనుగుణంగా జరిగే పీలుంటే ఆ ఇల్లు స్వర్గంగా మారే విషయంలో అసత్యంలేదు. ఆ లెక్కన అరుణాచలం గృహిణిలేని ఇల్లు చాలా చక్కని భవనం. అతను స్త్రీ లోలుడు అవటంచేత ఆ ఇంట్లో ఒకళ్ళిద్దరు స్త్రీలుండటం చాలా అవసరం అయింది. ఎందుకంటే-ఆడవాళ్ళల్లో చాలా మందికి మరో ఆడది అంటే పడకపోయినా వాళ్ళు ఉంటేగాని త్వరగా ఆ యింటికిపోరు. తీరా వెళ్ళిన తరువాత ఒకళ్ళనిచూసి ఒకళ్ళు అసూయ పడటం వేరే విషయం.

అందుకోసం అరుణాచలం ఇంట్లో తరుచు సావిత్రి కనుపిం చడం ప్రారంభించింది. అప్పటికే సావిత్రి తలిదండ్రులు చని

పోయారు. ఉన్న అన్నగారు వరంగల్‌లో వుండి సావిత్రి విషయం పట్టించుకోడు. అతనికి సావిత్రి అంటే అసహ్యం. మొత్తానికి హైద్రాబాద్ నగరంలో ఇంచుమించు అందరి ప్రణయ కలాపాలూ సావిత్రికి తెలుసు. మామూలు మనుష్యుల విషయం ఆ అమ్మాయి పట్టించుకోదు. అంతేకాదు- సృష్టిలో స్త్రీ పురుషజాతులు రెండు వున్నాయనీ, వాళ్ళిద్దరికీ మధ్య మధురమైన అనుబంధం ఉండటానికి అవసరం ఉందనీ ఆ అమ్మాయి మరిచిపోయింది. ఆ అమ్మాయికి తెలిసిందీ, ఆమె పట్టించుకొనేదీ ఒకే ఒక విషయం- అధికారులూ, డబ్బుకలవారూ, అందమైన అమ్మాయిలూ ఎవరైనా వుంటే, వారి మధ్య ఏదైనా ఉంటే ఆ సంగతి. అప్పుడు వాళ్ళు కూడా స్త్రీ పురుషులనే సంగతి పూర్తిగా మరిచిపోయి రాయబారాలు చేస్తుంది. ఈ రాయబారాల్లో ఏదైనా ప్రతిఫలం పుచ్చుకొంటుందా అంటే పూర్తిగా అదీ కనిపించదు.

ఒక ఉన్నతోద్యోగి రెండో పెళ్ళి చేసుకొన్నాడనీ, మొదటి భార్య చాలా దుఃఖపడుతోందనీ సావిత్రి కనిపించిన వాళ్ళకీ, కనిపించని వాళ్ళకీ చెప్పింది-కనిపించని వాళ్ళకి టెలిఫోను ద్వారా చెప్పింది. దానితో పోలీసు డిపార్టుమెంట్ ఆంధ్రదేశమంతా ఆ రెండో భార్య కోసం వెతికింది- ఆమె కనిపించలేదు! సావిత్రిని పిలిచి అడిగితే 'ఎవరో చెప్పారు, నే విన్నాను, నాకు మాత్రం తెలుసా?' అంది. ఇంకో తడవ అదే ఉద్యోగి నెత్తురు కక్కుకొన్నాడని చెప్పింది. అదీ అబద్ధమే.

దీన్ని బట్టి చూస్తుంటే సావిత్రికి అబద్ధాలు చెప్పి తద్వారా వచ్చే పరిణామాలు తిలకించడం చాలా ఆనందం అనిపిస్తోంది. ఈ అబద్ధాలు చెప్పటం కూడా ఒక జబ్బే- ఏదో చిత్రమైన ఆనందానుభూతి తద్వారా కలుగుతుందని విన్నాను. హత్యలు చేసేవాళ్ళూ, అర్థ రహితంగా సమాజ విరుద్ధంగా ప్రవర్తించేవాళ్లూ, దొంగతనాలుచేసే వాళ్ళూ ఇలాంటి ఆనందానుభూతినే బహుశా పొందుతూ ఉంటారేమో!

అబద్ధాలాడటం కూడా ఒక కళే! ఆ కళ అందరికీ చేతకాదు-

అది తప్పనటానికి వీలులేదు. వాక్స్వాతంత్ర్యం ఉన్న ఈ దేశంలో ఎవరిష్టం వచ్చినట్లు వాళ్లు మాట్లాడవచ్చును. మరి ఏ ఉద్దేశ్యంతో అబద్ధాలాడినా సావిత్రికి మాత్రం అబద్ధాలకోరనే పేరూ, వ్యభిచారిణి అనే పేరూ వచ్చేశాయి.

ఎలా వచ్చినా- ఈ రకం నిందలూ, అర్థంలేని ఆరోపణలూ అంటే సావిత్రికి ఏవిధమయిన భయమూ లేదు. తను చేస్తున్నది తప్పని ఆమె అనుకోదు- తనొకరకం విలాసయుత జీవితం గడుపుతున్నానని ఆమె ఉద్దేశ్యం ...పెద్ద ఉద్యోగులూ,మంత్రివర్యులూ, వారి తాలూకు సెక్రటరీలు అంటే ఆమెకు సరదా.

ఎందుకంటే- వాళ్ళు మానవులే గనుక ఎవరో ఒక స్త్రీని, ఎప్పుడోప్పుడు ప్రేమించటం జరుగుతుంది. నిజానికి ఆ ప్రేమ రాయబారానికి సావిత్రికి మించిన హంసరాజం ఇంకెవరూలేరు—పైగా సావిత్రికి ఇందులో ఏదో మానసికమైన ఆనందం కూడా లభించేది. హైద్రాబాద్ నగరంలో ఆనవాలు తెలియకుండా నల్లటి గుడ్డలు మొహాలికి కట్టుకొని రకరకాల ఆనందాలు పొందే కళ్లబ్బ ఒకటుండేది- అందులో అందర్నీ సావిత్రి ఏనాడో గుర్తుపట్టేసింది.

సరిగ్గా ఇదే సమయంలో రవీంద్ర భారతిలో ప్రకాశరావుగారు ఆమె చూడటం జరిగింది. చంచలంగా, అమాయికంగా, వెకిలిగాను, లావుగా కనిపించే సావిత్రిని చూసి ఒక విధంగా ఆయనకి ఆసక్తి కలిగిందనే చెప్పాలి. ఆ ఆసక్తి శారీరకమైందని అనుకోవటానికి ఎంత మాత్రం ఆస్కారంలేదు. ఎందుకంటే- ఆయన వయస్సు ఏభయి సంవత్సరాలు. కృష్ణా జిల్లాలో జన్మించారు- అగర్భ శ్రీమంతులైన ప్రకాశరావుగారు జీవితంలో కష్టసుఖాలు రెండిటినీ సమానంగా అనుభవించటం వలన విశాలమయిన శరీరంలాగానే మనసుకూడా విశాలమయింది....ఆ వైశాల్యానికి అంతులేదు. ఆయన దృష్టిలో అవసరాలే కాని ఆదర్శాలు లేవు. పొరపాట్లేగాని తప్పులు లేవు. అందుకనే ప్రక్కన ఉన్న స్నేహితుణ్ణి చూసి ఆ అమ్మాయి ఎవరని అడిగారు. ఆ స్నేహితుడి పేరు అవధాని. అతను ఉలిక్కిపడి చివరకు నవ్వి సమాధానం చెప్పాడు.

"ఇంకెవరూ కనపడలేదూ నీకు?" అన్నాడు.

స్నేహితుడి సమాధానం విన్నాక ప్రకాశరావుగారికి మరింత ఆసక్తి ఎక్కువయింది.

"ఏమిటి, అంత మరీ చెడిపోయిందా నాలాగా?"

"నువ్వు చెడిపోయావని ఎవరన్నారు? నువ్వేం చేస్తే అదే ఘనకార్యం. ఆ పిల్ల నీలాంటిదికాదు."

"అంటే, బుద్ధిమంతురాలా?"

"కాదు."

"చెడిపోయిందీ కాదు, బుద్ధిమంతురాలూ కాదు.........మరింకేమిటి?"

"అదొక రకం."

"అయితే తప్పకుండా పరిచయం చేసుకోవాలి" అన్నారు ప్రకాశరావుగారు. అవధాని విసుక్కుంటూనే సావిత్రిని తీసుకొచ్చి ప్రకాశరావుగారికి పరిచయం చేశాడు. ఈ అమ్మాయి బలహీనతలూ, ఆ కళ్ళూ గ్రహించిన ప్రకాశరావుగారు తన పలుకుబడితో ఒక ఉద్యోగం ఇప్పించి, ఒక ఇల్లు వాయిదాల పద్ధతిమీద తీర్చుకొనేటట్లు ఏర్పాటుచేశారు. అప్పటికి సావిత్రి ప్రకాశరావుగారికి పెంపుడు కూతురనే విషయం హైద్రాబాద్ నగరమంతా తెలిసి సావిత్రికి ఉన్న పలుకుబడి మరింత పెరిగింది.

సావిత్రికి అందం లేకపోయినా, కొద్దిగా పాడగలగడం చేతా-స్వార్థం అనే గుణానికి భక్తి అనే మెరుగుపెట్టి ప్రకాశరావుగారికి కాళ్లు పిసగడంచేతా నిజంగానే ఆయన ఆమెనభిమానించారు. సావిత్రి ఆయన అభిమానాన్ని పూర్తిగా దుర్వినియోగం చేసింది.

## 2

ప్రకాశరావుగారు ప్రేమోపహతులు. అందుకే ఏ స్త్రీ మీదా ప్రేమని పెంచుకొని నాదనుకోరు. సావిత్రి మీద జాలిపడి ఉపకా

రాలు చేశారు. కానీ ప్రేమతో కాదు, అభిమానం ఉంది-అది కేవలం సావిత్రి అదృష్టం. ప్రకాశరావుగారు స్త్రీత్వాన్ని ప్రేమిస్తారుగానీ స్త్రీని కాదు. ఆయన ఈ ఏభయి సంవత్సరాల జీవితంలోనూ ఏకపత్నీత్వం ఎప్పుడూ చెయ్యలేదు-అందుకని భార్యని ప్రేమించటం మానలేదు. ఒక తడవ తను చేపట్టిన స్త్రీని అన్యాయం చేయలేదు. ఆయనకు భయంలేదు, అందుకనే రహస్యం కూడా లేదు. దానివల్ల స్త్రీ విష యంలో ఆయనకి మంచి పేరు లేకపోయినా సత్యసంధులనీ, ఉపకార శీలి అనీ, పట్టుదల కలవారనీ, ఉత్తములనీ, దయామూర్తి అనీ, రాజకీయ చతురులనీ పేరూ, పలుకుబడీ, హోదా అన్నీ ఉన్నాయి. డబ్బుకి ఎప్పుడూ విలువలేదు. ఒకప్పుడు మంత్రివర్గంలో ఉన్నారు. ఆ తరువాత ఏవో రాజకీయమైన భేదాభిప్రాయాల వలన మంత్రి వర్గంలో లేకపోయినా ఆయన పలుకుబడి ఏమాత్రం తగ్గలేదు.

ఎందుకంటే- ఆ పలుకుబడి ఆయన వ్యక్తిత్వంవలన వచ్చింది

ఆ తరువాత ఆయన కాంగ్రెసు పార్టీలో ఇమిడి ఉండలేక పోయారు. నిజానికి రెండవ ప్రపంచ యుద్ధానంతరం ప్రపంచ స్థితి మారింది. సామ్రాజ్య తత్వం కూలిపోయింది. యుద్ధానంతరం వచ్చిన అకాలస్వాతంత్ర్యంలో భారతీయుడికి రావాల్సిన స్థానం ఇది కాదన్న సంగతి ప్రకాశరావుగారు గుర్తించటం వల్లనే ఆయన కాంగ్రెసు పార్టీనుంచి విడిపోవటం జరిగింది.

మానవుడి విశిష్ట వ్యక్తిత్వాన్ని, స్వేచ్ఛా ప్రియత్వాన్ని గుర్తిం చని ఏ సంస్థ అయినా తిరోగమనానికి దారితీస్తుందనే విషయాన్ని అరిచి చెప్పి నవ్యమానవ వాదాన్ని ప్రబోధించడం వలన చాలా మందికి ఆయనంటే గిట్టకుండా పోయింది.

ఒక విధంగా మొదటి నుంచీ ఆయన జీవితం అదోవిధమైన తిరుగుబాటుదనాన్ని పెంచుకొంది. చాలామంది తిరుగుబాటుదారులు కొంతకాలం తరువాత ఆ మార్గంనుంచీ, మనస్తత్వం నుంచీ విడి పడటం జరుగుతుంది కాని, ప్రకాశరావుగారు అలాకాదు. ఆయన లోని విచిత్ర మేధస్సు అనుక్షణమూ ప్రజ్వరిల్లుతూనే వుంది. దానికి

ముఖ్యమయిన కారణం. ప్రకాశరావుగారు తాత్వికులు—ఆయనలోని ఈ తాత్వికభావం ఉన్నతస్థితిని పొంది, ఉదాత్తమై ఔన్నత్యాన్ని సాధించింది.

ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఒక విచిత్ర తాత్వికుని తాత్విక ప్రగతిని విశదీకరించాలంటే వ్యక్తిగత విషయాలుకూడా చెప్పక తప్పదు—ప్రకాశరావుగారు తాత్వికులనటం వలన దార్శనికత పొందిన ఆయనవాక్కు, వ్రాతకూడా తార్కికగమనానికి అలవాటుపడ్డది. ఆయన భాష మనకి అర్థం కాకపోయినా ఆలోచనల్ని రేకెత్తించగలదు.

ఆయన జీవిత ధ్యేయం కేవలం జాతీయ స్వాతంత్ర్యం మాత్రమే కాదు—సామాజిక ఆర్థిక స్వాతంత్ర్యాలు. అందరికీ సర్వ సమగ్రమూ సంపూర్ణమూ అయిన మానసిక స్వేచ్ఛ ఆయన జీవిత ధ్యేయం. ఈ స్వేచ్ఛ మానవుడి ఉనికికీ, ఔన్నత్యానికీ కీలకమని ఆయన అంటూ ఉంటారు. అందుకనే ఆయన అభిప్రాయాలు ఒక దేశానికో ఒక మార్గానికో సంబంధించి వుండవు. ఈ ఎల్లల్ని దాటి అఖిల భారతాన్ని, ప్రపంచాన్ని అధిగమించిపోయి మానవజాతికి ఏకైక ఆదర్శంగా నిలవగల ఉదాత్త మానవతావాదం ఆయన ఆశయం.

మానవుడు సహజంగా మంచివాడు—అందుకే దోపిడిదొంగ వాల్మీకి మహాకవి అయినాడు. మానవుడు మంచివాడని నిరూపించా లనేది ప్రకాశరావుగారి కోరిక. అరవింద మహర్షి ఈ విషయములో ఆయనకి ఆదర్శం. కాని అరవింద మహర్షి మానవతావాదం చాలా వరకు భారతీయ సంస్కృతికి చెందిి ఉంటుంది. ప్రకాశరావుగారు ఎం. ఎన్. రాయికి అనుయాయి. రాయ్ మానవతావాదం విశ్వజనీన మైంది. అది దేశ కాలాలకు సంబంధించిందికాదు. ప్రకాశరావుగారి దృష్టిలో ఎం. ఎన్. రాయ్ భారతదేశంలో జన్మించిన మరో శంకరా చార్యులు.

ఏది ఏమయినా ప్రకాశరావుగారు మిస్టరీ మనిషి. ఒక విధంగా పెద్ద ఆశ్చర్యార్థకం!

రాలు చేశారు. కానీ ప్రేమతో కాదు, అభిమానం ఉంది-అది కేవలం సావిత్రి అదృష్టం. ప్రకాశరావుగారు స్త్రీత్వాన్ని ప్రేమిస్తారుగానీ స్త్రీని కాదు. ఆయన రః ఏభయి సంవత్సరాల జీవితంలోనూ ఏకపత్నీత్వం ఎప్పుడూ చెయ్యలేదు-అందుకని భార్యని ప్రేమించటం మానలేదు. ఒక తడవ తను చేపట్టిన స్త్రీని అన్యాయం చేయలేదు. ఆయనకు భయంలేదు, అందుకనే రహస్యం కూడా లేదు. దానివల్ల స్త్రీ విష యంలో ఆయనకి మంచి పేరు లేకపోయినా సత్యసంధులనీ, ఉపకార శీలి అనీ, పట్టుదల కలవారనీ, ఉత్తములనీ, దయామూర్తి అనీ, రాజకీయ చతురులనీ పేరూ, పలుకుబడీ, హోదా అన్నీ ఉన్నాయి. డబ్బుకి ఎప్పుడూ విలువలేదు. ఒకప్పుడు మంత్రివర్గంలో ఉన్నారు. ఆ తరువాత ఏవో రాజకీయమైన భేదాభిప్రాయాల వలన మంత్రి వర్గంలో లేకపోయినా ఆయన పలుకుబడి ఏమాత్రం తగ్గలేదు.

ఎందుకంటే- ఆ పలుకుబడి ఆయన వ్యక్తిత్వంవలన వచ్చింది.

ఆ తరువాత ఆయన కాంగ్రెసు పార్టీలో ఇమిడి ఉండలేక పోయారు. నిజానికి రెండవ ప్రపంచ యుద్ధానంతరం ప్రపంచ స్థితి మారింది. సామ్రాజ్య తత్వం కూలిపోయింది. యుద్ధానంతరం వచ్చిన అకాలస్వాతంత్ర్యంలో భారతీయుడికి రావాల్సిన స్థానం ఇది కాదన్న సంగతి ప్రకాశరావుగారు గుర్తించటం వల్లనే ఆయన కాంగ్రెసు పార్టీనుంచి విడిపోవటం జరిగింది.

మానవుడి విశిష్ట వ్యక్తిత్వాన్ని, స్వేచ్ఛా ప్రియత్వాన్ని గుర్తిం చని ఏ సంస్థ అయినా తిరోగమనానికి దారితీస్తుందనే విషయాన్ని అరిచి చెప్పి నవ్యమానవ వాదాన్ని ప్రబోధించడం వలన చాలా మందికి ఆయనంటే గిట్టకుండా పోయింది.

ఒక విధంగా మొదటి నుంచీ ఆయన జీవితం అదోవిధమైన తిరుగుబాటుదనాన్ని పెంచుకొంది. చాలామంది తిరుగుబాటుదారులు కొంతకాలం తరువాత ఆ మార్గంనుంచీ, మనస్తత్వం నుంచీ విడి పడటం జరుగుతుంది కాని, ప్రకాశరావుగారు అలాకాదు. ఆయన లోని విచిత్ర మేధస్సు అనుక్షణమూ ప్రజ్వరిల్లుతూనే వుంది. దానికి

ముఖ్యమయిన కారణం. ప్రకాశరావుగారు తాత్వికులు—ఆయనలోని ఈ తాత్వికభావం ఉన్నతస్థితిని పొంది, ఉదాత్తమై ఔన్నత్యాన్ని సాధించింది.

ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఒక విచిత్ర తాత్వికుని తాత్విక ప్రగతిని విశదీకరించాలంటే వ్యక్తిగత విషయాలుకూడా చెప్పక తప్పదు—ప్రకాశరావుగారు తాత్వికులనటం వలన దార్శనికత పొందిన ఆయనవాక్కు, వ్రాతకూడా తార్కికగమనానికి అలవాటుపడ్డది. ఆయన భాష మనకి అర్థం కాకపోయినా ఆలోచనల్ని రేకెత్తించగలదు.

ఆయన జీవిత ధ్యేయం కేవలం జాతీయ స్వాతంత్ర్యం మాత్రమే కాదు—సామాజిక ఆర్థిక స్వాతంత్ర్యాలు. అందరికీ సర్వ సమగ్రమూ సంపూర్ణమూ అయిన మానసిక స్వేచ్ఛ ఆయన జీవిత ధ్యేయం. ఈ స్వేచ్ఛ మానవుడి ఉనికికీ, ఔన్నత్యానికీ కీలకమని ఆయన అంటూ ఉంటారు. అందుకనే ఆయన అభిప్రాయాలు ఒక దేశానికో ఒక మార్గానికో సంబంధించి వుండవు. ఈ ఎల్లల్ని దాటి అఖిల భారతాన్ని, ప్రపంచాన్ని అధిగమించిపోయి మానవజాతికి ఏకైక ఆదర్శంగా నిలవగల ఉదాత్త మానవతావాదం ఆయన ఆశయం.

మానవుడు సహజంగా మంచివాడు—అందుకే దోపిడిదొంగ వాల్మీకి మహాకవి అయినాడు. మానవుడు మంచివాడని నిరూపించాలనేది ప్రకాశరావుగారి కోరిక. అరవింద మహర్షి ఈ విషయములో ఆయనకి ఆదర్శం. కాని అరవింద మహర్షి మానవతావాదం చాలా వరకు భారతీయ సంస్కృతికి చెంది ఉంటుంది. ప్రకాశరావుగారు ఎం. ఎన్. రాయికి అనుయాయి. రాయ్ మానవతావాదం విశ్వజనీనమైంది. అది దేశ కాలాలకు సంబంధించిందికాదు. ప్రకాశరావుగారి దృష్టిలో ఎం. ఎన్. రాయ్ భారతదేశంలో జన్మించిన మరో శంకరాచార్యులు.

ఏది ఏమయినా ప్రకాశరావుగారు మిస్టరీ మనిషి. ఒక విధంగా పెద్ద ఆశ్చర్యార్థకం!

ప్రకాశరావుగారు కృష్ణాజిల్లాలోని తరిగొప్పుల అనే గ్రామంలో ఏభయ్యేళ్ళ క్రిందట జన్మించారు. తండ్రి బాలకృష్ణయ్యగారు. గొప్ప సంస్కృత పండితులూ, సంపన్నులూను. తల్లి జయదేవమ్మగారు మహా సౌందర్యవతి అవటంవల్ల ప్రకాశరావుగారికి దుర్లభమైన శారీరక సౌందర్యం పుట్టుకతోనే వరంగా లభించింది. తల్లిదండ్రులు ఈయన్ని కాశీ అని ముద్దుగా పిలిచేవారు.

నాటికే ఆంధ్రదేశంలో స్వాతంత్ర్యోద్యమ సన్నాహాలు ముమ్మరంగా ఉన్నాయ్. ప్రకాశరావుగారిని ఆ ఉద్యమాలు అమితంగా ఆకర్షించటంచేత పాఠశాలనుంచి వెడలగొట్టారు. అప్పుడు బందరులో స్థాపించిన జాతీయ కళాశాల ఈ యువక విద్యార్థికి స్వాగతం ఇచ్చింది. తరువాత కొద్దిరోజుల్లోనే తల్లిదండ్రులు ఇద్దరూ మరణించడంచేత ప్రకాశరావుగారు స్వేచ్ఛగా రాజకీయాలలో ప్రవేశించారు. అప్పుడే స్వేచ్ఛాన్వేషణలో ప్రస్థానం ప్రారంభమైంది.

ఈ సందర్భంలో పోలీసు నిఘానుంచి తప్పించుకోటానికి రహస్యంగా తిరగాల్సి వచ్చింది.

భారతదేశం 1947లో స్వాతంత్ర్యం పొందింది. అప్పటికి ఎంతోకాలం కిందటనే ఆ మహత్తరాశయాన్ని సాధించటంకోసం ఎందరో ఎన్నో సాహసకార్యాలు చేశారు. 1914లో మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైనప్పుడు-విదేశాలకు పారిపోయిన భారత విప్లవవీరు లందరూ జర్మనీకి చేరటం ప్రారంభించారు. అప్పటికి దేశంలో ఏపరిణామాలు రాబోతున్నాయో సరిగ్గా తెలియకపోయినా స్వాతంత్ర్యం రావటం మాత్రం ఖాయం అనే ఊహ అందరిలో మెదులుతూ ఉండేది భారతదేశంలోని స్వాతంత్ర్య పిపాసువు లందరూ ఒక సమావేశం జరిపి రాష్ట్రానికి ఒక కార్యకర్తని ఎన్నుకొన్నారు. ఆ కార్యకర్తలలో ఆంధ్రదేశానికి ప్రకాశరావుగారు కార్యకర్త.

ప్రకాశం పంతులుగారినిగూడా ఎదిరించగల సాహసం ఆయనకి ఉండేది.

ఈ గొడవలన్నీ అయిపోయి దేశం స్వాతంత్ర్యం పొందాక

ప్రకాశరావుగారికి కాంగ్రెస్ టికెట్ ఇవ్వలేదు. దానికి కారణం ఆయన వ్యభిచారులనీ, త్రాగుబోతనీ, పేకాటాడతారనీ ఎవరో ప్రముఖ నాయ నాయకునికి చెప్పటం— ఆ విషయం తెలుసుకొన్న ప్రకాశరావుగారు స్వయంగా కారు నడుపుకుంటూ తెల్లవారేసరికి ఆ నాయకుని వూరికి చేరారు.

ఆ నాయకుడు అప్పుడే నిద్రలేచి వాకిట్లోకి వచ్చారు. ఆయన కూర్చున్న ప్రకాశరావుగారిని చూచి ఆశ్చర్యపడిపోయి ఇంకా పలకరించకముందే- ప్రకాశరావుగారు కారు దిగి ఆయనకి నమస్కరించి-

'నేను ఇదివరకు త్రాగేవాడినండి .. ఇప్పుడు మా అమ్మగారికి ఇచ్చిన వాగ్దానము వలన మానేశాను. పోతే, పేకాడటం అసలు నాకు రాదండి. వ్యభిచారం చేసే మాట మాత్రం నిజమేనండి. ఇప్పటికీ చేస్తూనే ఉన్నాను. స్త్రీలోని ఆకర్షణకంటె పార్టీ టికెట్‌లో నాకేమీ ఆకర్షణలేదు.ఆ కారణంచేత మీరు టికెట్ ఇవ్వటం మానేస్తే నాకేమీ అభ్యంతరం లేదు. ఎందుకంటే- పదవికోసం స్త్రీని వదులుకోలేను నేను. మీరు చాలా మంచిపని చేశారు, థ్యాంక్స్. మరి వెళ్లొస్తానండీ' అని సమాధానంకోసం ఎదురుచూడకుండా కారు తిప్పుకుని తిరిగి వచ్చేశారు.

తరువాత చాలారోజులకు ఆ నాయకుడు ఏదో ఉపన్యాసంలో ప్రకాశరావుగారి ఈ వ్యక్తిత్వాన్ని గురించి మాట్లాడుతూ, ఇలాటి నిజాయితీపరులూ సత్యసంధులూ నిర్భయులూ స్వార్థరహితులూ దేశానికి అవసరం అని చెప్పారు.

తరువాత ప్రకాశరావుగారు మంత్రివర్గంలో పనిచేసి విసిగి కాంగ్రెస్‌కి రాజీనామా ఇచ్చారు. ఆ తరువాత ఆయనలోని మానవత్వం మరింత మహోన్నతమైనది. శాస్త్రజ్ఞుల పరిణామ సిద్ధాంతం- మతస్రష్టల సృష్టిసిద్ధాంతం ఏకంగా ఉండాలని ఆయన ప్రయత్నం.

మెదడు ఎదిగిన కొద్దీ మానవుడు భూమి తనకు ఆధారం అని భావించటం మానేస్తాడు- మెదడు సంపూర్ణంగా ఎదిగిన తరువాత తనకి ఏదో ఆధారం అన్న విషయాన్ని అత నెన్నడూ ఒప్పుకోడు- ప్రకృ

తికి ఇంతవరకూ చేస్తున్న బానిసత్వంనుంచి అతను విముక్తుడవుతాడు-దేవుడనే అగోచర పదార్థానికి అర్థాన్ని రూపాన్ని అన్వేషిస్తాడు.

భౌతికమైన ఆర్థికశక్తుల నియంతృత్వానికి మానవుడిని బానిసనిచేసిన మార్క్సు సిద్ధాంతాలంటే కూడా ప్రకాశరావుగారికి గౌరవం లేదు.

అందుకే ప్రతి మనిషిలో ఉన్న మంచితనాన్ని బయటికి తీయాలనే ప్రయత్నంలో పూర్తిగా చెడిపోయిన సావిత్రిని చేపట్టారు ఆయన.

ఆంధ్ర రాజధాని హైద్రాబాదులో ప్రకాశరావుగారి స్వంతభవనంలోనూ, ఆఫీసులోనూ కూడా- సావిత్రి ఆడింది ఆట, పాడింది పాటగా తయారయింది. చాలామంది ప్రకాశరావుగారి ఈ ఔన్నత్యాన్ని స్త్రీలోలత్వంగా అనుకున్నారు. సావిత్రికి పెద్దలందరి దగ్గరా గౌరవం ప్రకాశరావుగారితో సాన్నిహిత్యంవల్లనే లభించింది.



హైద్రాబాద్ మహానగరం. చాలా మందికి అది భూతలస్వర్గం. నిజానికి చాలా సుందరమైన నగరం అనటంలో ఆశ్చర్యంలేదు. ఢిల్లీ తరువాత భారతదేశానికి నాయకత్వం వహిస్తున్న నగరాల్లో రెండోది. ఇందుమించు వైస్‌ప్రెసిడెంటు లాటిది. విలాసాలకు, వినోదాలకు, విశృంఖలమైన కళాజీవితానికీ అది నిలయం. ఆ నగరంలో అన్ని వినోదాలతోపాటు ఆడదికూడా ఒకటి. సృష్ట్యాది నుంచీ నేటివరకూ అంతులేని ఆనంద వర్ధనాల్లో ఆడది ఉన్నాగాని- అసంతృప్తి, అర్థరహితమైన మానసికోద్రేకం ఉన్నవాళ్లు ఒకే ఆడదానితో తృప్తిపడరు. వాళ్ళకి నిషాతోపాటు కొత్తదనం కావాలి.

హైద్రాబాద్ అలాటివాళ్ళకు అద్భుత స్వప్న ప్రపంచం. పూర్వం హైద్రాబాద్‌లో 'మెహబూబ్‌కీ మెహందీ' లో మాత్రమే

ఖరీదుకి స్త్రీ దొరికేది. ఇప్పుడు ఆంధ్ర రాజధాని అయి వ్యభిచార నిరోధ చట్టం వచ్చిన తరువాత అంతవరకూ మెహబూబ్‌కీ మెహందీలో మాత్రమే దొరికే స్త్రీ పట్టణంలో అన్ని చోట్లా దొరకటం ఆరంభించింది. హోటళ్ళల్లో, కార్లల్లో, చార్మినార్ దగ్గర, గండిపేటలో, సెక్రటేరియట్ ఎదురుగా, రవీంద్ర భారతి ముందు, ఆకాశవాణి ప్రాంతంలో- ఎక్కడపడితే అక్కడ. ఎలాపడితే అలా ఆడది ఉద్యోగం అనే ముసుగుమాటున బహిరంగంగా ప్రణయం ప్రారంభించింది. చట్టం మూలంగా ఏదో ఒకచోట ముసుగుపడి ఉండాల్సిన కామం అన్నిచోట్లా ప్రవేశం పొందింది.

వీళ్ళకి ఒకేసారి కొత్త పద్ధతులు తెలుసు. ఇప్పుడు ముగ్గురున్న ఇళ్లల్లో వాకిలి ముందు తెల్లని గంట, ఎల్లని గంట ఉంటాయి. అవి రెండూ. లోపలికివెళ్ళి ఎవరు కావాలంటే వారిలో గడిపి హాయిగా బయటపడవచ్చు. వెళ్ళినవారిని ఏ పోలీసు ఎవ్వరోగాని అడగరు ఎందుకు? గంటలు తీసేయమనడానికీ, లోపలికి వెళ్ళవద్దనటానికీ ఏ పోలీసుకీ అధికారం లేదు గనుక! న్యాయంగా ఇవేవీ చట్టరీత్యా నేరం కావు. లోపలికివెళ్ళి ఏం చేస్తారనేది ఎవరికీ తెలియని విషయం. ప్రజాస్వామిక భారత దేశంలో వ్యక్తి స్వేచ్ఛ కాదనటానికి వీలులేని విషయం.

ఇవి చాలక కళారాధన పేరుతో రకరకాల ఫొటోలు అమ్ముతారు. ఎవరికైనా ఆ ఫొటోలో ఉన్నామె కావలసివస్తే ఏర్పాటు చేయడం కూడా చేస్తుంటారు. అప్పటినుంచి ప్రతి ఆంధ్రుడూ కళాపిపాసి అయినాడు. హైదరాబాద్ వెళ్ళిన ప్రతివాడూ కళారాధకుడై పోయే ప్రమాదం ఏర్పడిందికూడా!

ఎవరైనా ఫొటోగ్రాఫర్ దగ్గరికివెళ్ళి ఒక సుందరి ఫొటో కావాలని అడగడం తరువాయి, అయిదారు ఆల్బములు ముందు పడేస్తాడు-అందులో ఆడవాళ్ళవీ మొగవాళ్ళవీకూడా ఫొటోలు ఉంటాయి. ఆడవాళ్ళు మొగవాళ్ళని ఏరుకోవచ్చును; మొగవాళ్ళు ఆడవాళ్ళని ఏరుకోవచ్చును-అయిదారు రూపాయిల దగ్గరనుంచి అయిదారువందల వరకూ ఆ ఖరీదు ఉంటుంది.

కొంచెం ఉన్నవాళ్ళూ, వ్యవహారం రహస్యంగా అఘోరిం చాలనుకునే వాళ్ళూ, కళా పిపాసువులూ ఈ ఫొటోగ్రాఫర్లకు రాజ పోషకులు. ఇదికాక పాశ్చాత్య దేశాల్లో లాగానే వ్యాపార సంస్థల్లోనూ వాటిల్లోనూ ఆడవాళ్ళు సేల్స్‌గరల్స్‌గా ఉంటున్నారు. అందమైన ఆడపిల్ల నవ్వుతూ ధర చెబితే బేరమాడకుండా కొనే స్వభావం మగవాడిలో ఉన్నంతవరకూ వ్యాపార సంస్థలు ఏం చేస్తాయి ఆడపిల్లల్ని నియోగించక?

ఇవికాక పెద్ద యెత్తున క్లబ్బులూ హోటళ్ళూ ఉండనే ఉన్నాయి. 1959 లో హైద్రాబాద్‌లో ఉన్న క్లబ్బుల కన్న ఇప్పుడు ఉన్న క్లబ్బులు రెట్టింపు.

కొన్ని క్లబ్బుల్లో డబ్బుంటే చాలు- అన్ని అవసరాలూ అందుబాటులో ఉంటాయి. ఈ క్లబ్బులకి సంపన్నులూ, రాజకీయ వేత్తలూ, పెద్ద ఉద్యోగస్థులూ, అందగత్తెలూ అందరూ వస్తారు. ఆడవాళ్ళూ మొగవాళ్ళూ త్రాగి సరదాగా చీట్లపేక ఆడుతూ ఉంటారు.

ఇదికాక ఇంకో సరదా ఏమిటంటే-సెక్స్ పెర్వర్శిటీ. నిషిద్ధ మార్గాల్లో సెక్స్. సావిత్రికి ఇవన్నీ కరతలామలకం. చాలా మంది పెద్ద ఉద్యోగస్థుల ప్రణయాలకి సావిత్రి హంస. ఇలాటి సావిత్రికూడా ప్రేమించింది. ఆ ప్రేమికుడు ఆమెను మొదట నాశనం చేసినవాడే. ఆయన పెద్ద ఉద్యోగి. పేరు రాజశేఖరం. అన్నిటికన్నా ఆశ్చర్యం ఏమిటంటే-మొదట ద్వేషించిన వారినే చివర ప్రేమించడం.

అసలు ఈ నగరం స్వభావమే అది. మొదట ఈ నగరం ఒక వేశ్యపేర నిర్మించబడిందని చెబుతారు. నేడు హైద్రాబాద్ నగరం ఉన్నచోట నాలుగు వందల ఏళ్ళకుముందు చావల్‌బండా అనే చిన్న ఊరు ఉండేది. ఆ ప్రాంతాన్నే నేడు షాలిబండ అంటున్నారు. మూసీనదీ తీరాన ఉన్న ఆ చిన్న ఊరిలో భాగ్యమతి అనే అపురూప సుందరి ఉండేది. మూసీనది అవతల ఒడ్డున కుతుబ్ షాహీరాజుల రాజధాని నగరమైన గోల్‌కొండనుంచి రాజకుమారుడు ఆ అపురూప సుందరికోసం ఐదారు మైళ్లు స్వారీచేసి అర్ధరాత్రివేళ ఆ పల్లెటూరికి వచ్చేవాడు. అతనిపేరు మహమ్మద్‌కులీ.

ఈ రాజకుమారుడు ప్రతిరోజూ రాజధానిని వీడి ఈ పల్లెటూరికి వస్తున్న విషయం అప్పటి రాజైన గోల్కొండ నాల్గవ నవాబు ఇబ్రహీం కుతుబ్షాకి తెలిసింది. తన కొడుకు రోజూ రాత్రి ఇలా వెళ్ళటం, వరదల్లోవున్న నదినికూడ గుఱ్ఱంమీదనే దాటిపోవటం తెలుసుకొని భయపడి వెంటనే గోల్కొండనుంచి చావల్బండాకు పోయేబాటమీద మూసీనదికి వంతెన కట్టటానికి ఏర్పాటు చేశాడు. ఆ వంతెన పేరే పురానాపుల్. అది ఇప్పటికీ వుంది. ఈ వంతెనని ప్యారిస్లోని ప్యాన్ఔన్యూఫ్ వంతెనకు పోలుస్తారు.

రాజయాక మహమ్మద్కులీ తన ప్రియురాలైన హిందూ సుందరి భాగ్యమతి పేరుతో భాగ్యనగర్ అనేపేర తన నవ రాజధానిని నిర్మించాడు. ఈ మహానగరానికీ స్త్రీకీ ఆదినుంచీ అద్భుతమైన ఒక విచిత్ర సంబంధం వుంది. అందుకే ఈ నాటికీ దాని అధిష్ఠాన దేవత స్త్రీయే. మొదటినుంచీ ఈ మహానగరంలో ఆశ్చర్యాలమీద ఆశ్చర్యాలు జరుగుతూనే వుండేవి. ఎవడో వింత జోస్యం చెప్పేడని కొన్ని లక్షలు ఖర్చుచేసిన మక్కామసీదు నిర్మాణము మధ్యలోనే ఆగిపోయింది. 1665 లో మీర్జుమ్లా కొడుకు మహమ్మద్ అమీన్ తప్పతాగి రాజసింహాసనముమీద కక్కన్నాడు. ఔరంగజేబంతటివాడు రాయబారి వేషంలో దౌలతాబాద్నుంచి హైదరాబాద్కి వచ్చి దాన్ని పట్టుకోవాలనే ప్రయత్నంలో ఓడిపోయినాడు. దానికి కారణం అప్పటిరాజు అబ్దుల్లా ఈ విషయం గ్రహించి గోల్కొండకు పారిపోవటం. నిజాం తరపున ఫ్రెంచిసేనాని రేమాంఛ్ఇంగ్లీషువారిచేత ఓడింపబడి తనకు ప్రాణప్రదమైన రెండు కుక్కల్ని గుఱ్ఱాన్ని పేల్చి చంపి పాతిపెట్టి తనుకూడ ఆత్మహత్య చేసుకున్నాడు. ఆ సమాధులు ఈనాటికికూడ సెంట్రల్ ప్రెస్కు అర్ధమైలు దూరంలో వున్నవి. 1803 లో రెసిడెంట్ ఒక తురకపిల్లని లేవదీసుకు పోయినందుకుగాను ఫర్జిందే మెహబతేపై వందే ఆనే బిరుదు నవాబు తప్పితే మరి ఎవ్వరివ్వగలరు? ఆ బిరుదుకి అర్థం ప్రేమలగ్న తనయుడని. అదో మహా ఘనకార్యంగా నవాబు భావించాడు. ఆ పిల్లపేరు

ఖైరున్నిసా బేగం అనీ, ఆమెకు రెసిడెన్సీ కోఠీలో రంగమహల్ అనే భవనం కట్టించేడనీ కథలు చెప్పుతారు. ఇప్పుడు అదే రెసిడెన్సీ భవనంలో స్త్రీల కళాశాల వుంది. స్త్రీకీ ఆ మహానగరంలో అనేక భవనాలకీ అనూచానంగా ఏదో ఒక సంబంధం మొదటనుంచీ వుంటూనేవుంది.

హైద్రాబాద్‌లో ఒక దిగుడు బావి వుంది. ఆ దిగుడు బావి లోతు 15 అడుగులు. ఈ దిగుడు బావిని ఒక సైనికుడు సరదాగా దాటుతూ వుండేవాడట. దురదృష్టవశాత్తూ 1807 జూలై 9 వ తేదీ ఇల్లాగే దాటుతూ గుఱ్ఱంతోసహా బావిలోపడి చనిపోయి నాడు. ఆ తరువాత అతని ప్రియురాలికోసం ప్రతి సంవత్సరం జూలై 9 వ తేదీ అర్ధరాత్రి అక్కడికి అతని దెయ్యం వస్తూవుండే దని ప్రతీతి. ఇప్పుడు అతని ప్రియురాలు గూడలేదు. అయినా ఇప్పటికీ ప్రతి ఏటా జూలై 9 వ తేదీ అర్ధరాత్రి గుఱ్ఱాన్ని ఎక్కి అతను అక్కడ కనుపిస్తూనే వుంటాడట.

ఇది కాక సాలార్జంగ్ తన వ్యక్తిగత ఆనందం కోసం అనేక కళాఖండాలని పోగుజేశాడు. ఇప్పుడు ఆ కళాఖండాలు అలాగేవున్నవి. అందులో నూర్‌జహాన్ అందాల హస్తంవాడిన కటారి ఒకటి. జహాంగీర్ తీయనిపెదవులు తాకిన పానపాత్ర మరొకటి. హైద్రాబాద్‌లో మానసిక రోగులకు కూడ ఒక ఆసుపత్రి వున్నదన్న విషయం మనం మరచి పోకూడదు. ఈ మహానగర నిర్మాణం ప్రారంభమయేనాటికి నాటి ప్రపంచ మహానగరాలలో ఒకటి ఆంధ్రుల రాజధానియైన విజయ నగరం విధ్వంసమై 30 ఏళ్ళన్నాకాలేదు. విజయనగరాన్ని విధ్వంసం చేసిన వారిలో ఒకడైన ఇబ్రహీమ్ కుతుబ్‌షా కొడుకు—మహమ్మద్ కులీ నేటి ఆంధ్ర రాజధాని హైద్రాబాద్ నిర్మాత కావటం విధి విలాసాలలో ఒకటని చెప్పవచ్చును. హైద్రాబాద్ సికిందరాబాద్ జంటనగరాల మొత్తం వైశాల్యం 96 చతురపు మైళ్ళు. మద్రాసు నగర వైశాల్యం 56 చదరపు మైళ్ళు మాత్రమే. ఆ మాటకువస్తే ప్యారీస్ నగర వైశాల్యం 30 మైళ్ళే. స్త్రీ పేర నిర్మితమైన ఈ మహా

నగరంలోనే మొగల్ సామ్రాజ్యానికి అంత్యక్రియలు జరిగినవి. అయినప్పటికీ ఆ సంప్రదాయానికి అంత్యక్రియలు జరుగలేదు.

ఆ మహానగరం ప్రాచ్యఖండపు కాన్‌స్టాన్‌టినోపుల్ అనే ప్రఖ్యాతి గడించటంతోపాటు తూర్పునాటి ఇటాలియన్ అనే ప్రఖ్యాతిగల ఆంధ్రభాష కలిగిన ఆంధ్రప్రదేశ్‌కు రాజధాని అయింది. దాన్ని మొదట స్థాపించిన 1591 వ సంవత్సరం కంటె దాన్ని నిజాం రాజధానిగా జేసుకున్న 1925వసంవత్సరం కంటె, అది ఆంధ్ర ప్రదేశ్‌కు రాజధానియైన 1956 వ సంవత్సరం దాని చరిత్రలో గణనీయమైనది, గొప్పదికూడ.

అసంపూర్తిగావున్న మక్కామసీదుని ఔరంగజేబు పూర్తి చేయించి దానిమీద ఒక అద్భుతమైన వాక్యాన్ని వ్రాయించాడు. ఆ వాక్యం ఏమిటంటే—

"ఏ పనీ ఏ ఒక్కడూ ఎప్పుడూఅనుకున్నట్లుచేయలేదు" అని.

ఆ వాక్యంలో ఎంత నిజమున్నా ఎప్పుడో అప్పుడు ఎవరో ఒకరు అనుకున్నంతపనీ చేయటం గూడా లేకపోలేదు. అనుచిత సంబంధాలు, అర్థరహిత వాంఛలు, స్త్రీ పరమైన పలుకుబడి, బారులు. కారులు, బ్రహ్మాండమైన భవంతులు, అద్భుతమైన సౌందర్యము, అవినీతి నిండిన ఈ మహాపట్నంలో కవిత్వానికి మేధకి తక్కువేమీలేదు.

హైద్రాబాద్ నగరాన్ని నిర్మించిన మహమ్మద్ కులీ గొప్ప ప్రేమికుడే కాకుండా గొప్ప రచయిత కూడాను. ఆయన కవితలో భాగ్యమతితోపాటు మరో 12 గురు ప్రియురాళ్ళుగూడ కనబడతారు. ఆయన గజల్, కసీదా, మస్నవీ, మర్శియా మొదలైన అన్ని రకాల కవితలూ వ్రాశాడు. ఆయన కవిత్వంలో చెప్పినట్లు ప్రియురాలు లేనిదే పానపాత్రలోని మదిర త్రాగరాదు. ప్రియురాలు లేనిదే ఒక్క క్షణమూ జీవింపరాదు. "ప్రియావాజ్ ప్యాలాపియా జాయనా పియా వాజ్ ఏక్దిల్ జియాజాయనా." తన నిర్మాత జెప్పిన ఈ కవిత్వాన్ని అప్పట్నించి ఇప్పటివరకూ అనుసరిస్తూనే వుంది మహానగరం హైద్రాబాద్.

విజయవాడనుంచి కారులో బయలుదేరితే నాలుగైదు గంటల్లో ఆకాశవాణి ట్రాన్స్‌మిటరు స్తంభాలు ఎర్రదీపాలతో స్వాగతం ఇస్తాయి. న్యాయంగా చెప్పాలంటే ప్రతి మనిషికీ అక్కడినుంచే మైకం గమ్మటం ప్రారంభమవుతుంది. ఆ మైకం దిగాలంటే మళ్ళీ విజయవాడ చేరాలి.

ఆర్డినరీ ఆంధ్రుడు....అంటే కాస్త డబ్బున్న సామాన్యుడు హైద్రాబాద్ వెళ్ళాలని తరుమూ అనటం ఆంధ్రలో సర్వ సామాన్య మైన విషయం. అందులో ఆశ్చర్యపడ్డానికి ఏమీలేదు. రాజధానీ నగరంలో పనిలేనివాడు ఎవడూ ఉండడు. పర్మిట్టు దగ్గనించీ పినతల్లి కొడుకు ప్రమోషను వరకూ అనేక రకాల పన్లు. ఈ పన్లమీదే ఇద్దరు ముగ్గురు కలిసి బయలుదేరి హోటల్సులో మకాం పెడతారు.

ఎలక్షన్లలో అనేక వాగ్దానాలు చేసిన మంత్రివర్యుల దర్శనం సులభంగా కాదు, అయేసరికి అయిదారు రోజులు పడుతుంది. ఈలోగా చేసేందుకు పనేమిటయ్యా అంటే తాగటం. దీనికి మించిన మంచి పని అందమైన సృష్టిలో ఆనందానికి పొందిక మరోటి లేదని చాలా మందికి తెలుసు. అనంతరం మాంసంముక్కల గలీజుతోను, మసాలా దుర్వాసనతోనూ, ఆడవాళ్ళ రహస్య ఆగమన నిర్గమనాలతోను హోటళ్లు నిండిపోతాయి.

హైద్రాబాద్ నిద్ర లేచేసరికి పొద్దెక్కుతుంది. మళ్ళీ సెక్ర టేరియట్ చుట్టూ తిరిగి సాయంత్రం హోటలుకి చేరుకుని........ ఈ పంపిణీమీద తెచ్చుకున్న డబ్బు కాస్తా అయిపోయి తిరిగి వచ్చే స్తారు. సెక్రటేరియట్‌లో ఫైలూ, పినతల్లి కొడుకు అదృష్టం ఎక్కడి వక్కడే కదలకుండా నిలిచిపోయాయి.

# 4

సావిత్రి తనకు తాను ఒక రకమైన బహుమతి ఇచ్చుకుంది. అదేమిటంటే ప్రతి ఒక్కరికీ తన యవ్వనా న్నర్పించింది....

అర్పించలేదుకూడా. అరుణాచలంతో ఎక్కువగా ఆదే పనిగా పోట్లాడుతుంటుంది. ప్రేమ సంబంధంలో పోట్లాడాలనిపిస్తుం దేమో? అది ఎంతవరకు పోవాలో అంతవరకూ పోతుంది.

నిజం చెప్పాలంటే ప్రేమలో నిజం లేదేమో? ఔన్నత్యం కూడా లేదేమో....

అందులో అసహ్యంకూడా ఉంది.

ఎందుకసహ్యించుకుంటుందో ఆమెకే తెలీదు. ఇవన్నీ ప్రకాశ రావుగారు చిరునవ్వుతో పరికిస్తున్నారు. కాని వాళ్ళిద్దరకూ సాన్ని హిత్యం లేకపోలేదు. అయినా ఆమె స్త్రీ. ఔన్నత్యం కూడిన స్త్రీ. సంకుచితమైన జీవితంలో ఆమె బాగానే బ్రతుకుతోంది. అందులో కూడా నిక్కచ్చిగా బ్రతుకుతున్న బ్రతుకులో ఏదో చిత్రం లేక పోలేదు. అందుకని అందులో నీచం కనపడకుండా ఉండదు.

అప్పుడే ఆమె ముసలిదానిగా కన్పిస్తోంది. ఈ పాతదనానికి, ముసలితనానికీ అర్థ మేమిటో ఎవరికీ అంతుచిక్కదు. తన గత జీవి తానికి ఇప్పుడు మూలం ప్రకాశరావుగారు.

అయినా మానవులు కలుసుకుంటే, ఏదో కామాన్ని లోకం అంటగడుతుంది. ఈ కామవ్యాపారంలో సావిత్రి చాల ఔన్నత్యాన్ని పొందింది.

ఈ చర్విత చర్వణంలో సావిత్రి పాత్ర చాలావుంది. ఎందు కంటే ఆమె మహానగరంలో స్త్రీ. కవులేదైతే చెప్తారో అందులో ఎంతో కొంత నిజం లేకపోలేదు. ఆ నిజంలో సావిత్రి ఔన్నత్యాన్నే పొందింది. అదే మళ్ళీ చెప్పాల్సొస్తుంది. ఆమె 'మహానగరంలో స్త్రీ.' ఎప్పుడూ తనుమంచిదాన్ననీ, గొప్పదాన్ననీ అనుకుంటుంది. అది ఎంత నిజమో....మగవాడికి తెలియదు. ఇప్పుడు ఆడవాళ్ళు అదేపనిగా తాము ఉన్నతులమని భావించడం ప్రారంభించారు. అందమైన పవిత్రమైన స్వేచ్ఛ వున్న సీతలాంటి స్త్రీ కూడా భూమిలోకి దిగి పోయింది.

విషాదకరమైన విషయ మేమిటంటే మగవాడు స్త్రీయని స్త్రీని అనుసరిస్తాడు. అందుకేనేమో రాముడు సరయూనదిలో దిగిపోయింది?

ప్రేమ ఒకవిధంగా కుక్కలాంటిది. అస్తమానం మొరుగుతూనే ఉంటుంది.

స్త్రీని ఎప్పుడూ సాగుబడి చేయాలని అంటారు. ఆకలిగొన్న పసిబిడ్డవంటివాడు పురుషుడు. అతని అనుసరిణియై స్త్రీ జీవితం గడపాలి. అయినా పసిపిల్లయైన కామాన్ని అనుసరించడం ఈ కాలంలోనూ కనిపిస్తోంది. ఈ కామాన్ని విస్తారంగా వినియోగించుకున్నప్పుడు, ఆహ్లాదంకూడా విషాదంగా పరిణమిస్తుంది.

మనస్సులో ఇష్టంలేకుండానే మగవాణ్ణి ఆకర్షిస్తుంది స్త్రీ. కవులు, రచయితలు ఔన్నత్యాన్ని గూర్చి సరిపడ్డ లెక్కల్తో చాలా గొప్పగా చెప్తారు. ఇది శుద్ధ అన్యాయం. ఔన్నత్యం వేరు, ప్రేమ వేరు అని మామూలు మనుషుల భావన. ఇది మరో బాధ.

తనని తను పూర్తిగా సమర్పించుకోకుండానే పురుషుని ఆక్రమించుకోవాలని చూస్తుంది స్త్రీ. అందులో సావిత్రిలాంటి స్త్రీ. ఇది యుగయుగాలుగా వస్తోన్న ఆశ్చర్యార్థకాల్లో ఒకటి.

ఔన్నత్యాన్ని ఏ స్త్రీయైనా,....ఆఖరుకు అక్క చెల్లెళ్ళలోనయినా సరే-ఒక యుద్ధం క్రింద చూస్తారు స్త్రీలు. ఇది మరో చిత్రం!....

సామాన్యంగా ప్రతి స్త్రీకి 'సిజోఫ్రెనియా'కాని, 'క్లెప్టోమేనియా' కాని ఉండటం, సామాన్యంగా ఈ మహానగరంలో చూస్తూంటాము. సావిత్రికి ఇవి రెండూ ఉన్నాయి. ఇదిగాక బ్లాకు మెయిల్‌కూడా చేస్తుంది. ఎంత తెలివిగలవారైనా ప్రకాశరావుగారు ఈ గుణాలు కనిపెట్టలేకపోయారు.

ఒకరోజు పోలీసు డిపార్టుమెంటులో ఉన్నతోద్యోగి, మరో ఆపిడా ప్రకాశరావుగారికి అతిథులుగా వచ్చారు. హైద్రాబాద్‌లో సుర సేవించడం నేరం కాదుగనుక-బీరు ఆతిథ్యంగా ఇచ్చారు ప్రకాశరావుగారు. ఇవ్వక తప్పలేదు. ఇంకో విషయ మేమిటంటే- బీరు నిషా కలిగించిందంటే, ఆ నిషానుండి తేరుకోవటం అంత సులభంకాదు. ఆ కారణంచేత ఆ ఉన్నతోద్యోగి, సావిత్రి అదేపనిగా బీరు త్రాగడం

వల్ల చచ్చేట్టు పోట్లాడుకున్నారు. దాంతోటే ప్రకాశరావుగారికి కోపం వచ్చింది. ఆ కోపంలో హుస్సేన్‌సాగర్‌కి వెళ్ళి అక్కడ కూర్చుండి పోయారు.

ప్రకాశరావుగారికుండే కొన్ని గుణాలు ఇక్కడ తప్పకుండా చెప్పాలి. ఆయనకి యెప్పుడు మూడ్ వస్తుందో ఆ ఈశ్వరుడికే తెలియాలి.

ఆయనగురించి ఆయనతలచుగా చెప్పుకునే మాట లేమిటంటే. సాహిత్యాంబరంలో, సంగీతాంబరంలోకూడా ఆయన స్వాతంత్ర్య ప్రియుడు. స్వేచ్ఛగా విహరించడం ఆయన గుణాల్లో ఒకటి. చర్విత చర్వణమైనా మళ్ళీ ఒకసారి చెప్పక తప్పదు - ఆయన స్త్రీత్వాన్ని ప్రేమిస్తారు కాని, స్త్రీని కాదు. ఛందోబద్ధంగా లేని పద్యాలుకూడా వ్రాశారు. ఆయన భాషలో నిరుక్త పరిచారు. అదేమిటోకాని నిరుక్త పదమంటే ఆయనకి చాలా యిష్టం.

పైగా ఒకప్పుడు మంత్రివర్గంలో ఉండటంచేత చాలామంది ఆయనకు భయపడి ఆయన ఈ పదాల్ని ఎవరూ ఏమీ అనరు. అసలు అనటానికి కూడా ఏమీలేదు. నిరుక్తమంటే ఏమిటో తెలిసి చస్తేగా!

ఆయన ఈ కవిత్వంకూడా సామాన్యంగా చచ్చినా అర్థం గాదు. వృత్తి నియమం అనే పదం ఆయనకి చాలా యిష్టం. ఇది కూడా బోధపడదు మామూలు మానవులికి. ఆయనమీద లోకానికుండే గౌరవభావంవల్ల నోరు మూసుకుంటారు.

ఏది ఏమైనప్పటికినీ, అంబరంనుండి జారిన వానజల్లులాగా ఆయన వ్యధిత హృదయాన్నుంచి రాలిన ఈ కవిత్వాన్ని ప్రతివాళ్ళు బావుందంటారు. ఆయన బుద్ధిలాగానే ఆ కవిత్వంలో ఔన్నత్యం, కుంటీకూడా ఉన్నాయి.

ఏది ఏమైనా ఆయన గొప్ప సాహసి. ఆఖరికి ఆ సృష్టికర్త క్కూడా ఈయన్నాజ్ఞాపించే సామర్థ్యం లేదేమో?

ఆ అంతులేని వియోగి జీవితాంతం ఏదో వ్యధ అనుభవిస్తూనే ఉన్నారు. ఇద్దరు భార్యలు పోవడం, ఇంకా ఇలాటివే ఏవో....

కాని, పైకి మాత్రం ఉత్త ఆయన ఎమ్.ఎల్.సి. ఉన్నబాధఏదో అంతర్యంలో రగులుకుంటూ ఉంటుంది. ఆ మహావ్యక్తి సహజ ఉన్నతుడు. కాని ఆయన హృదయంలో ఖేదం, వ్యధ, భగ్నస్థితి ఉన్నాయని చాలామంది గ్రహించలేరు. ఎందుకంటే-పైకి నవ్వులుం టారు. వృద్ధులైనా, భగవంతు డిచ్చిన సౌందర్యంవల్ల వ్యధ అసలే కనిపించదు. ఆయన దాక్కున్న చందమామ. ఒకవిధంగా వెన్నెల్ని కోల్పోయారేమో?

ప్లావితమైన భావగీతికలా ఒక నిరాశ ఆయనలో అప్పుడప్పుడు విప్లవాన్ని రేపుతుంది. అంతేగాదు- ఆధ్యాత్మికమైన ఆనందాన్ని సమ కూరుస్తుంది.

ఆయన కాయనే ప్రణయ వియోగినని చెప్పుకున్నా- ఆయన స్త్రీని ప్రేమిస్తారంటే నాకు నమ్మకంలేదు.

ఆయన ఎప్పుడూ నవ్వుతూనే ఉంటారు. స్వార్థం లేదు. అసూయ అంతకన్నా లేదు. చవకబారుతనం అసలే లేదు. వెదికినా వెకిలి తనంలేదు. తనకెంతో ఇష్టమైన వస్తువునైనా సరే- తేలికగా దానం చేయగలరు.

ఆయన ఇప్పించిన ఉద్యోగాలకు లెఖ్ఖలేదు. ఒక విధంగా ఆనందం గూడుకట్టుకున్న మూర్తి.

వృద్ధునిగా కనిపించని వృద్ధుడు ఆయన. ఇంకో విధంగా పూజనీయులు.

ప్రాచీన సౌందర్యానికి చిహ్నం. చాతకాని కవి. జీవితంలోనే కాకుండా కౌన్సిల్‌లో కూడా నటులు.అంటే-రాజకీయవేత్త. అందంగా బరువుగా వాలిపోయి మరింత సుందరంగా కన్పిస్తున్న ఆయన కళ్ళల్లో ఏదో ప్రకాశం భాసిస్తుంది. కొంచెం తెలివిగల వాళ్లెవరైనా ఆయన్ని చూడగానే నమస్కరిస్తారు. లేదా కనీసం మానసిక నమస్కారమైనా చేస్తారు. తేజస్వియైన ప్రకాశరావుగారిని చాలామంది పురాణాల్లో చదివే బ్రహ్మర్షి అనుకుంటారు. లేదా ఉమర్ ఖయ్యాం అనుకుంటారు.

కాదా, కనిపించని ఔన్నత్యం రక్తంలో ప్రవహిస్తోన్న చక్రవర్తి అనుకుంటారు. శాపవశంచేత కలియుగంలో జన్మించిన మహేంద్రు డనుకుంటారు. కాదు....ఈనాటి ఎం.ఎల్.సి. రేపటి ఋషి. ఎల్లుండి చేతకాని కవి. ఆవలెల్లుండి వాడిపోయే సమున్నతమైన మానస సరోవరపు మహాపద్మం. శ్రీ ప్రకాశరావుగారు పండితులు. చిన్నప్పుడు చాతకాని గాయకుడు; పెద్దయినాక మహానటులు.

ఎన్ని రోజులు గడినా ఆయనలో గొప్పతనమే కన్పిస్తుంది. ఆయన అలవాట్లు, వ్యక్తిత్వం చిత్రమైనవి.

ఆయన స్నేహితులెవరూ ఆయన్ని చూడకుండా ఉండలేరు. ఆయన ఎవరితోను విరోధం పెట్టుకోరు. పెట్టుకుంటే ఆయనంటే సింహస్వప్నమే. మహాభయంకరులు. జీవితం ఆయనకొక కేళి.అందరినీ క్షమించి, అందరినీ కోప్పడతారు. ఆయన వ్యక్తిత్వం,కవిత్వం చచ్చినా అర్థంకావు. ఎందుకంటే-ఆ రెంటికీ భేదంలేదు.

దానమంటే ఆయనకి చాలా ఇష్టం. తిండి పదార్థాలు కొని పిల్లలకిచ్చి చాలా ఆనందిస్తారు. ఏ స్త్రీయైనా తప్పుచేసిందంటే ఫరవా లేదనే రకం.

శాశ్వతంగా వాకిలిమూయడం ఆయనకు గిట్టదు. తప్పులు చేస్తూ దిద్దుకుంటూ గెరిల్లా దగ్గరినుండి సంస్కారియైన నేటి మానవుడి కథ నెప్పుడూ మరచిపోరు. ఎవరన్నా త్రాగుతుంటే, జాత్యసంబంధాలు పెట్టుకుంటే ఆయన ఏమీ అనుకోరు.

జనక మహారాజులాగా ఆయన రాజయోగి. శుభ్రంగా తింటారు. కాని తిండికి లొంగిపోరు. ఉపవాసంకూడా ఉండగలరు.

ఆయన హృదయంలో మిఠాయి, ఆంతర్యంలో పునుగు జవ్వాజి, మనస్సులో సంగీత సాహిత్యాలు-చిన్నప్పుడు వ్రాసిన ఇనప భాషపై ప్రేమ. తన్నెవరైనా, ఏదైనా అడుగుతారని తెలిస్తే, చక్రవర్తిలా నడచి,వాళ్ళని హడలగొట్టి, వాళ్ళని వెళ్ళిపోయేట్టు చేయడం-ప్రాచీన ప్రియురాళ్ళ అవసరాలు గమనించడం-బ్రతుకు నొక మహాకళగా గడపడం-ఎదుటివాడు ఏడిచి గీపెట్టినా తనమాటే నెగ్గాలను

కోవడం-ప్రతిదీ అందంగా ఉండాలనే వాంఛ-అంతగా అవసరమైతే ఇతరుల్ని ఏడిపించుకు తినడం-హాస్యంగా మాట్లాడి అందర్నీ నవ్వించడం ఆయనకు సరదా.

మధ్య మధ్య పారిపోవడం—ఎక్కడికిపోయినా, ఎవరికి తెలియక పోవడం-పిల్లల కజీర్ణం పుట్టేవరకు తినిపించడం, తినకపోతే తన్నడం-ప్రేయసో, పరాయిదో ఏపనిమీద వచ్చిందో తెలిసికోకుండానే ఆడదానిని గౌరవించడం కాక ఆ ఆడదానిలో రతీదేవిని, సరస్వతిని, ఊర్వశిని, పిచ్చిపిల్ల శకుంతలను, ఉత్తమ ఇల్లాలు సీతాదేవిని చూడడం కూడా కద్దు.

ఇప్పుడు హుస్సేను సాగర్ ఒడ్డున ఎందుకోగాని ఆయనకి భార్యలు జ్ఞప్తికి వచ్చారు. వెంటనే అరుణ తరణి కిరణస్పర్శ పులకితమై రాగరజితమైంది ఆయన హృదయం. ఆయన చిన్నప్పుడు వ్రాసిన కవిత్వంలో చచ్చినంత పదాడంబరం కన్పిస్తోంది ఉమర్ ఖయ్యాం ఆత్మను నమ్మడు. కాని ఈయన ఆత్మను నమ్ముతారు.

ఆత్మ శాశ్వతత్వాన్ని గూర్చి ఆయనకు పూర్తి విశ్వాసం ఉంది. ఎందుకంటే- ఆయన తీరని దుఃఖం ఆత్మని నమ్మితేనే గాని పోదు.

చిన్నప్పుడు వ్రాసిన కవిత్వంలో- ఓ అమర వనవహాసీ, నీ తను లావణ్యామృత శోభ రాకా శారద శుభ్ర శశాంకచంద్రికల విలీనం బయ్యోనో-అన్నారు. ఇది గురజాడ అప్పారావుగారి కాపీ. భగ్నతనం అనే పదమంటే ఆయనకి చాలా ఇష్టం. అది తప్పు. భగ్నత అనాలి. అప్పటికి ప్రకాశరావుగారు చాలా చిన్న వయస్కులు. క్షమించవచ్చును.

అందమైన ఈ ప్రౌఢమూర్తి హృదయం ఈశ్వరుడికీ ఇంద్రుడికీ పంచాయతి. ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. భార్యలిద్దరూ ఆయన ప్రేయసులు కూడా. ఓ అరగంటపాటు తిరిగి దేవిని ప్రార్థించి అనాహతశబ్దాలు విని కొంపచేరారు ప్రకాశరావుగారు. అప్పటికే ఏడుస్తూ పారిపోయింది సావిత్రి.

నీ పాపాల లెఖ్ఖ ఎంతంటే, నా గాయాల లెఖ్ఖ ఇంత-అని నుడివారు శ్రీ ప్రకాశరావుగారు. అందుకే సావిత్రి నిష్క్రమణం ఆయనకి బాధ కలిగించింది. లేక కాళ్ళొత్తటానికి కెవ్వరూ లేరనే బాధేమో? ఏది ఏమైనా ఆమె మహానగరంలో స్త్రీ కదా! ఆవిడకు చాలా పనులుండి ఉండవచ్చును అనుకున్నారు.

# 5

సావిత్రి త్రాగుడు మైకంలో ఏమీతోచని అస్తిమిత మనస్తత్వం తోనే ఇల్లు కదిలింది. వెన్నెల కురుస్తోంది.

బయటకు వెళ్ళి టాక్సీలో కూర్చుంది. ఆమె ఇచ్చిన చిరునామా ప్రకారం ఒక క్లబ్బుముందాపాడు టాక్సీ డ్రైవర్. మెల్లిగా తూలుతూ క్రిందికి దిగింది. మీటరు చూపించని చార్జీకి డబ్బు చెల్లించి క్లబ్బులోకి నడిచిపోయింది.ఆ భవనం ఇంద్రలోకంలోని మహేంద్రుడి సభాప్రాంగణంలా తోచింది సావిత్రికి. స్వర్గలోకంపైకి నడిచిపోతు న్నట్టుంది ఆమెకు ఆ మెట్లెక్కుతూంటే. ఆ నడకలో గంభీరం వుట్టి పడేలా, హొయలు ఒలకబోస్తూ లోనికి ప్రవేశించింది. లోపల అయిదారుగురు పెద్దహోదాలు గలవారు టేబిలుముందు కుర్చీల్లో ఆసీనులై, పేకాడుకుంటున్నారు. ఒక స్త్రీ కూడా వాళ్ళల్లో వుంది. ఆ టేబిలుకు మధ్యలో ఒక పొడుగాటి సీసా ద్రవంతో కనిపించింది సావిత్రికి.అది ఏ బ్రాండో తెలుసుకునేందుకు ఎక్కువసేపు పట్టలేదు. వాళ్ళ ముందు గ్లాసులు కొన్ని నిండి వున్నాయి. కొన్ని గ్లాసుల్లో సగంమేరకే వుంది ఆ ద్రవం. వాళ్లు మంచి నిషాలో వున్నట్టున్నారు.సావిత్రిని చూసినట్టు లేదెవ్వరూ. టకాటకా హైహీల్సును చప్పుడుచేస్తూ, వాళ్ళ ముందుకు చేరింది చిరునగవుతో. అందరూ ఒక్కసారిగా పిచ్చిగా మత్తుగా చూచి "హలో సావిత్రీ!" అన్నారు. ఆ గొంతుక లొక్కొక్కటే

డబాడబా రాళ్ళబండిలా మ్రోగాయి, ఒక్క స్త్రీ గొంతుక తప్ప. ఆవిడ షేక్‌హాండ్ ఇచ్చింది కూడా.

"కూర్చో మేడమ్!" అన్నాడు ఒకతను, ఖాళీ కుర్చీని ఆమె చేరువకు జరుపుతూ. ఆమె 'థాంక్స్' చెప్పుతూ కుర్చీలో కూర్చుండి పోయింది. మరొకసారి అక్కడ ఆసీనులైన వారి వదనాల్లోకి పరికించి చూచింది సావిత్రి. తన ఎదురుగా కూర్చునివున్న బ్రాందీ వర్ణపు ముఖాన్ని చూడగానే ఒక్కసారి గతుక్కుమంది. పేకముక్కలు ఒకచేత్తో పట్టుకొని రెండవచేత గ్లాసు నందిపుచ్చుకుంటూ అతనూ ఆమె కళ్ళల్లోకి చూచాడు ఒక విధమైన భావనతో. అతని పెదవులు నిషాతో కూడిన హుషారులో విచ్చుకున్నాయి.

ఆమె నవ్వక తప్పలేదు. కాని లోలోపల ఉడికి పోతూనే ఉంది. అతను ఎవ్వరోకాదు-కొన్ని క్షణాల క్రితం తనతోబాటు బీరు సేవించిన పోలీసు ఉద్యోగి. అరె! తనకంటె ముందుగా చేరాడే ఈయన! ఆమె మరింత ఆశ్చర్యపోయింది. ఎవరివల్ల తాను తగవు పెట్టుకొని నిరుత్సాహపడి కొంచెం ఎడతెఱపి కోసం ఇలా వచ్చిందో, అతనే మళ్ళీ కనిపించడంతో ద్వేషాగ్ని రగుల్కొంది. కాని పూర్వపు అయిష్టత, తగువులోని కఠినత్వం అతనిలో ఇప్పుడు మాయమయి పోవడంవల్ల ఒక నిట్టూర్పు విడిచి సర్దుకు కూర్చుంది. ఆ పోలీసు ఉన్నతోద్యోగి-సేవించిన బ్రాందీ గ్లాసు బల్లపై నుంచాడు. ఆ శబ్దం కొంచెం కరుకుగా తోచింది సావిత్రి చెవులకు.

మళ్ళీ ఒకసారి అతని వదనంలోకి తొంగి చూచింది. అతను పక్కచూపులతో మందహాసం చేశాడు. అందమైనవాడు కాకున్నా, ఎత్తుకుతగ్గ లావుండటంవల్ల చలాకీతనంతోబాటు పదవీదర్పం తొంగి చూస్తోంది అతనిలో.

అతని పక్క మరెవరో కూర్చున్నాడు. తరువాత కుర్చీలో రాజశేఖరం రాజకీవితో ఏమీ గమనించనట్లు బ్రాందీ తీసుకుంటున్నాడు.

"ఏం సావిత్రీ, ఇది కొంచెం పుచ్చుకో!" అంటూ మరో గ్లాసులో బ్రాందీ పోసి ముందుకు జరిపాడు ఎంతో ఆప్యాయతను ప్రదర్శిస్తూ- ఆ పోలీసు ఆఫీసరు.

రాజశేఖరాన్ని గూర్చిన గత జీవితపు పుటలను తిరగేస్తున్న సావిత్రికి ఒక్కసారి గుండెదడ హెచ్చింది. శరీరం వేడివల్ల వణికి పోతోంది. స్తిమితపడాలని ఎంతగానో ప్రయత్నించింది.

వెన్నెల రాత్రుల్ని, నదీ ప్రవాహాల్ని, సాగర తరంగాల్ని, మహోన్నతమైన దివ్య నక్షత్రాల్ని ఎంతో మనోహరంగా చిత్రీకరించి తన మనోఫలకంపై ముద్దుగా అద్దిన గొప్ప చిత్రకారుడు-రాజశేఖరం.

రాజశేఖరం ప్రేమ పిపాసికాదు- విలాస పురుషుడు. ఉత్త చవకబారు ప్రేమకలాపాలంటే ఆయన కిష్టం....కాని తాను తెలుసుకో లేక పోయింది మొదట. తనేదో రాజ భోగా లందుకుంటున్నదని భావించింది, అతని పలుకుల సవ్వడివిని మురిసిపోతూ. ఏమీ తెలీని వాడు కాదు....అన్నీ తెలిసి....బుద్ధి వక్రతవల్ల మరొకరి క్షీణదశకు ఆనందిస్తూ, పైకి మటుకు వ్యధితునిలా నటించే మహాభోగి.

ఒక మాటలో చెప్పాలంటే- తన అవసరాలకి,తన కోరికలకి, తదితర స్వలాభాలకి ఇతరులను తేలికగా మంచినీళ్ళప్రాయంలా విని యోగించుకుని....కృతజ్ఞత సైతం లేకుండా తనదారిన తాను పోగల ధీమంతుడు అతను.

అందుకే సావిత్రి హృదయ స్పందనలు, హాహాకారాలు ఏమీ వినిపించడంలేదు రాజశేఖరానికి. ఈ ఊహతో సావిత్రి మరీ కుమిలి పోతోంది. ఆమె ఎందరినో చూచింది. ఎందరితోనో తిరిగింది. కాని, ఎవ్వరినీ అంత ఇదిగా ఆకర్షించుకోలేదు....ఎవ్వరివల్లనూ ఆక ర్షింపబడలేదు....ఒక్క రాజశేఖరంవల్ల తప్ప!

'అబ్బ రాజశేఖరం! నన్నింత మోసగించి కూడా, ఇంత నంగనాచిలా ఉన్నావేం ఏమీ తెలియనట్లు-మహా నిబ్బరం నీతోనే పుట్టు కొచ్చిందన్నట్లు-' ఇలా సాగిపోతోంది ఆమె హృదయవేదన. ఆవిడ క్షుభిత హృదయం మహానలంలో మాడిపోతోంది,

అంతటి నిషాలోనూ, మధురతరమైన పాత సంఘటనలను నెమరు వేసుకుంటున్న సావిత్రి స్త్రీ....పాపం స్త్రీ-సావిత్రి. పూర్వపు శిథిలాలయాలు-ఆమె మనోవేదనలు.

ఆ పోలీసు ఆఫీసరు ఏదో గుర్తుకు వచ్చినవాడై —

"సావిత్రీజీ, మీరేం కలలు కంటున్నారు? ఇది పుచ్చుకోండి, అన్ని సంఘటనలూ మరిచి పోతారు. చాలా ఉల్లాసం పొందుతారు కూడా!" అంటూ గౌరవంగా మరో గ్లాసు నందించాడు....అతని బహువచన ప్రయోగానికి విస్తుపోయి తేరుకుంది ఆమె తన ఆలోచనల్ని కట్టిపెట్టి. ఆ అధికారి అలా సంబోధించటానికి ఒక కారణముంది. సావిత్రి పూర్వం ఎలా తిరిగినా, చెడినా ఇప్పుడు ప్రకాశరావు గారింట్లో ఉండటంవల్ల కొంత పరపతిని పొందింది. పైగా అంతో ఇంతో గౌరవంగా జీవించాలనే ఆసక్తి ఆమెలో మెండుగా కనిపిస్తోంది. అంతేగాక ఇంతక్రితం వాగ్వివాదం ఆతనితో పెట్టుతున్నదామె. ఎంతసేపటికీ తానిచ్చిన గ్లాసు పుచ్చుకోకుండా అలాగే ఏదో ఆలోచిస్తూ గంభీర్యం చూపించడంవల్ల- ఇక లాభంలేదని ఆ ఉన్నతోద్యోగి అలా మాట్లాడాల్సి వచ్చింది. కాని, సావిత్రి ఆలోచించేది మరొకటి.

"క్షమించాలి, ఆలస్యం చేసినందుకు!" అంటూ సావిత్రి ఆతనికి కృతజ్ఞత తెలిపి ఒక్క గుటకలో తాగేసింది. కంఠంలోకి ఒక విధమైన వేడితోబాటు ఘాటునుకలిగి, బ్రాందీ దిగజారిపోతోంది. మసాలా అద్దిన టొమాటో ముక్కలు, ఆమ్లెట్లు, ఉడికించిన కోడి గుడ్లు ఒకవేపు, మరొకవేపు ఘుమఘుమలాడే మాంసం ముక్కలూ పలురంగుల గాజు ప్లేట్లలో అమర్చబడి ఉన్నాయి. అవి తింటో కూర్చుంది సావిత్రి. ఆమెకు మరో వక్కన కూర్చున్న స్త్రీ ఏదో మాట్లాడుతూ అదే పనిగా నవ్వుతోంది- అందులో ఒకతనిని ఏడిపించాలనే చాపల్యంతో. బ్రాంది ఆమెని పూర్తిగా లొంగతీసుకున్నట్లుంది, అందుకే మరీ అంత ఇదిగా, వెకిలిగా, స్త్రీనన్న భావం మరచి, కళ్ళుమూస్తూ తెఱస్తూ నవ్వడం. ఆమె నవ్వులో కొంత సొంపు ఉంది కాబట్టి సరిపోయింది కాని, లేకపోతే ఆ నవ్వుకు పైకప్పు దూరంగా ఎగిరిపోయేది. ఆమెనిచూచి అందరూ పేక ముక్కల్ని క్రిందపెట్టారు, ఆడటం మానేసి....

రాజశేఖరం గ్లాసులు నింపుతున్నాడు. ఎవరికి తోచిన పదార్థాల్ని వారు తీసికొని తింటూ- ఏదో చర్చిస్తున్నారు. సావిత్రికూడా వాళ్ళలో మామూలుగా కలిసిపోయి ఒక్కొక్కరినీ తదేక దృష్టితో చూస్తోంది. మనలో ఎవరైనా వాళ్ళు సంభాషించే విషయాలేమిటా అని వింటేమటుకు ఏ ఒక్కటీ ఎవ్వరికీ సంబంధించింది కాదని తెలుస్తుంది. వాళ్ళకు వాళ్ళే ఏదో పిచ్చిగా నవ్వుకుంటున్నారు. ఇది ఆ క్లబ్బులోని ప్రస్తుత పరిస్థితి. వినయంగా పనిమనుషులు వాళ్ళకు కావలసినవేవో సరిగా అమరుస్తూనే ఉన్నారు భయభక్తులు కలిగి. వాళ్ళకి ఈ తతంగమంతా రోజూ అలవాటే గనుక కొత్త వింతేమీ కాదు.

ఆలా గంటకు పైగా గడచి పోయింది కాలం- నవ్వులతో గిలకరింపబడుతూ.

పిచ్చాపాటి ముగించి,అందరూ ఎవరింటికి వాళ్ళు వెళ్ళిపోవాలని తీర్మానించుకున్నారు ఆ పెద్దలు. అందరూ హాలు బయటికి వచ్చారు. వీడ్కోలు చెప్పుకొని ఒకరు స్కూటరుపై, మరొకరు కారుమీద, ఇంకొకరు టాక్సీలో వెళ్ళిపోతున్నారు.

# 6

సావిత్రి రోడ్డమ్మటే చకచకా నడచిపోతోంది. ఆ పోలీసు ఉన్నతోద్యోగి కారు ఆమె ప్రక్కగా వచ్చి నిలిచింది. అతను స్టీరింగ్ పక్కనుండి బయటికి తొంగి చూస్తూ "సావిత్రీ! ఒంటరిగా ఇంత రాత్రి నడిచిపోతున్నావేం? కార్లో కూర్చో!" అంటూ డోర్ తెరచి పట్టుకున్నాడు-ముసిముసిగా నవ్వుతూ.

సావిత్రి కొంచెం తటపటాయించింది. అయినా తుదకు ఒక నిశ్చయానికి వచ్చి పెదవులపై చిరునవ్వులు చిందిస్తూ-కార్లో ఎక్కి కూర్చుంది అతనిపక్క.

"ఏం సావిత్రీ! నాపై ఉన్న కోపమంతా తగ్గిందా? లేక ఏమైనా సాధిద్దామని నాతోబాటు వస్తున్నావా?" అంటూ కారు స్టార్టు చేశాడతను.

అతని ఓరచూపులు తట్టుకోలేక అతను కారు నడిపే తీరును చూస్తూ తలొంచుకుంది సావిత్రి. లోపల ఏవో తీయని బాధలు వేడి వేడిగా అలుముకుంటున్నాయి యిద్దరికీ.

"ఏమండీ....ఇప్పుడు ఇంటికెళ్ళాలనీ లేదు, ప్రకాశరావుగారింటికి వెళ్ళాలనీ లేదు. మీకెటు ఇష్టమైతే అక్కడికే చేరుకుందాం!" అంది గోముగా అతనిపై ఎనలేని అభిమానం చూపుతూ. తాగుడు వల్ల ఆమె కంఠం మరింత రాగరంజితమైంది.

వీధిలో, మేడలపై, షాపుల్లోను దేదీప్యమానంగా వెలిగే రంగు రంగుల విద్యుద్దీపాలు ఆమె కళ్ళల్లో సరసాలాడుతున్నాయ్. స్వర్గాన్ని మైమరపింపజేస్తున్నాయి. రోడ్డుపై కారు సాగుతోంది. ఆ ఆఫీసరు పక్క ఠీవిగా కూర్చొని ఆనందానుభూతిలో ఏదో అనిర్వచనీయమైన శక్తిని కూడగట్టుకుంటోంది సావిత్రి. పూర్వస్మృతులు ఆమెకేమీ ఇప్పుడవసరంలేదు. ఆఫీసరు ఒక కంటితో ఆమె ముఖంలోని వింత వింత సోయగాల్ని చూస్తూ మరోకంటితో కారు డ్రైవు చేస్తున్నాడు. వాళ్ళకిప్పుడాకారు విమానం వంటిది. అతను సారధి. ఆమె అనుసరిణి.

పురవీధుల మలుపులు తిరిగి కారు ఒంటరిగా వున్న అతని స్వంత భవనంముందు ఆగింది.

"నా కిష్టమైన ప్రదేశమిదే సావిత్రీ! ఇక్కడ నీకు నచ్చుతుందా అని అనుమానం—" అంటూ అర్థోక్తిలో ఆపాడు.

"నేను మొదటనే మీ కభయమిచ్చాను. మీ ఇష్టమే నా ఇష్టమని" అంటూ సాగదీస్తూ డోరు తెరచుకొని కిందికి దుమికింది ఆమె. అతనూ దిగాడు.

ఇద్దరూ మెట్లెక్కి ఇంటిలోనికి ప్రవేశించారు.

ఆడవాళ్ళున్నట్టు లేదు ఆ యింట్లో. ముగ్గురు నౌకర్లుమాత్రం

వస్తాదుల్లా కనిపించారు. వంగి సలాములు చేస్తూ భయభక్తులతో ఎక్కడివారక్కడే చేతులు కట్టుకొని నిలుచున్నారు. వారి నియమ బద్ధమైన అలవాట్లను చూసి దగా అనుకుంది సావిత్రి. ఇద్దరూ మేడ మెట్లెక్కి ఆ ఆఫీసరు స్వంత గదిలోనికి ప్రవేశించారు. అది ఎయిర్ కండిషన్డ్ గది. చక్కగా అలంకరించబడి వుంది. నాలుగు సోఫా సెట్లు, అలంకరణ సామగ్రి, దేశనాయకుల ఛాయాచిత్రాలు, విలు వైన మూడు బెల్జియం అద్దాలు, పెద్ద బీరువాలో కొన్ని వందల పుస్తకాలు, చూడ ముచ్చటగా సర్ది పెట్టబడి ఉన్నాయి. ఒకవైపు రెండు పెద్ద స్ప్రింగు మంచాలు- డన్‌లప్ పరుపులతో చక్కగా అమర్చబడి వున్నాయి. టేబిల్‌పై రంగు రంగుల, రకరకాలుగా సువాసనలీనే పువ్వులు రెండు మూడు వాజుల్లో పేర్చబడి వున్నాయి.

ఇవన్నీ పరికిస్తూ, ఆ అధికారి ఐశ్వర్యానికి లోలోపల అసూయ పడసాగింది సావిత్రి. ఐనా పైకి నవ్వుతూనే ఆయనగారితో మాట్లాడటం సాగించింది.

"ఏమండీ, నాకు నిద్ర ముంచుకొచ్చేస్తోంది. ఏదో మైమర పిస్తోంది. కళ్ళు బరువుగా వాలిపోతున్నాయి" అంటూ ఒక మంచంపై వాలిపోయింది. ఆ అధికారి సిగరెట్ వెలిగించి మరో మంచంపై కూర్చున్నాడు.

సావిత్రి అలంకరణ, ఆమె అందం చూస్తూ అలానే కొంచెంసేపు గడిపాడు. అతనికి ఏమీ తోచడంలేదు. పైగా తన పక్కన ఉన్న స్త్రీ. యవ్వనపు బిగిచే హొయలొలికే ఆ శరీరపు పొంకం అతనిలో ఏవో మధురస్మృతుల్ని రేపాయి.

"సావిత్రీ, నీకు నిద్ర వస్తోందా ఈ ఇంట్లో? కాని నాకు మటుకు ఏమీ తోచకుండా ఉంది. ఏమైనా కబుర్లు చెప్పు. కొంచెం సేపు కులాసాగా కాలం గడుపుదాం!" అన్నాడు అధికారి.

"ఐసీ! ఏ విషయం చెప్పమంటారు? ఈ మహానగరంలో అన్నిమూలలూ తిరిగాను, అందరి చేష్టలూ చూశాను. అన్నీ అనుభ వించాను, కాని మాటల్లో చెప్పడమంటే ఏదో కొత్త అనిపిస్తోంది"

అంటూ తన పుట్టుపూర్వోత్తరాలు, రాజశేఖరం ప్రణయం, అరుణాచలంతో పరిచయం, ప్రకాశరావుగారి ఉదారస్వభావం అన్నీ మెరుగులు దిద్ది చెప్పసాగింది.

ఆ ఉన్నతోద్యోగి సావిత్రి కిప్పుడు స్నేహితుడు, సహచరుడు, ఆత్మీయుడు, బంధువు. "ఏఅరమరికలు లేకుండా సాఫీగా సాగిపోయింది నా జీవితం. ఇంకా సంతృప్తిగా సాగిపోవాలని నా ఆకాంక్ష." తన సంపూర్ణ చరిత్రను చెప్పి ముగించింది సావిత్రి.

అతడు తన గత జీవిత బాధల్నీ, సుఖాల్నీ- ఉద్యోగరీత్యా సాధించిన విజయాల్నీ. కుటుంబ పరిస్థితుల్నీ ఏకరువుపెట్టి చెప్పుకొచ్చాడు ఉపురికార్డరులా.

ఇద్దరూ తమ గాధలు వివరించుకొన్నారు. అంతేగాక ప్రముఖులైన మహానగరంలో వ్యక్తుల్ని కొందరిని గూర్చి, ఆయా వ్యక్తుల మనస్తత్వాలనుగూర్చి చెప్పుకున్నారు వారి వారిబుద్ధికి తోచినట్లుగా.

ఈ కబుర్లతో కాలం చాలా గడిచిపోయింది. వాళ్ళ గొంతులు ఇంచుమించు ఎండిపోయాయనే చెప్పవచ్చు.

"సావిత్రీ, ఆ గాడ్రెజ్ అలమారులో విస్కీట్ బ్రాందీ ఉంది. కొంచెం ఈ తాళపు చెవులతో తెరచి, అది పట్టుకురా" అంటూ ఆమెకు తాళపుచెవుల గుత్తి అందించాడు.

హుషారుగా పక్కనుంచిలేచి, అలమారా తెరచి ఒక గ్లాసు, బ్రాందిసీసా, అందులో ఉన్న ఒక పొట్లంలోని ఖాజా ఇత్యాది సామగ్రి తెచ్చి అతని ముందుంచింది, పక్కనే కూర్చుంటూ. బట్టలూ, క్యాష్ చెస్ట్, బంగారు నగలపెట్టె, వెండి పళ్ళాలు మొదలయినవి ఆ పెద్ద అలమారాలో జిగేల్‌మని మెరిశాయ్ సావిత్రి కళ్ళల్లో. అప్పుడు ఆమెకి తోచిందల్లా- ఆ అధికారి ఒక్క ఉద్యోగంలోనేకాదు ఆస్తిలోనూ ఉన్నతుడని. అంతేగాదు- జల్సాలోనూ ఆరితేరిన మహా ఘటమని తెలుసుకుంది సావిత్రి.

ఇవన్నీ చేస్తూనే ఉంది కాని, తన మనసులో మెదలుతున్న,

మహానగరం హైద్రాబాద్ ఆమెని అనుక్షణం ఆహ్వానించటం ప్రారంభించింది. అప్పటికే గన్నవరం హైస్కూల్లో స్కూలుఫైనలు పాసయింది. ఒక సుప్రభాతాన హైద్రాబాద్‌లో ఉన్న వేలువిడిచిన పినతల్లి కూతురు ఇంటికి చేరింది. చింతామణి అందంగా లేకపోయినా దూరంనుంచి అందంగా ఉన్నట్లు కనిపిస్తుంది. తద్వారా ఒక ఉద్యోగం సంపాదించటమే కాకుండా ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గారి దయవల్ల రేడియో నాటకాల్లో కూడా పాల్గొనటం ప్రారంభించింది. అప్పుడు బుచ్చిబాబుగారు జీవించే ఉన్నారు. ఈ అమ్మాయిని చూసి ఆయనకేం బుద్ధిపుట్టిందో పుస్తకాలు వ్రాస్తే లాభసాటిగా ఉంటుందని సలహా ఇచ్చారట.

ఆయనలో ఉన్న వ్యంగ్యం రచన కుటీర పరిశ్రమ కాదని తెలియనివ్వలేదు....సరే- ఆ రోజునించీ వ్రాయటం నేర్పమని బుచ్చి బాబుగారి చుట్టూ తిరగటంతో ఆమెను రచయిత్రిని చేయక తప్పలేదు.

ఆ తరువాత ఆయ నెన్నడూ ప్రకృతిని చూపిస్తూ రచించటం నేర్పలేదు.

తదనంతరం చింతామణికి ఆరోగ్యం సరిలేక ఉద్యోగం పోయింది. ఆ సందర్భంలో ఒక సినిమా పాటల రచయిత ఆమెను సినిమాల్లో ఎక్‌స్ట్రా వేషాలకి రికమెండ్ చేశారట. అంతే- ఆ తరు వాత ఆయనా మర్చిపోయినారు. ఒకటి రెండేళ్ళ తరువాత ఆ సాంగ్ రైటరు ఆవిడ ఇల్లూ, ఒళ్ళో పిల్లా చూసి గాభరా పడ్డారు. తల్లినుంచి జీవి జన్మించటానికి తండ్రి అనే దౌర్భాగ్యుడి చిరునామా బొత్తిగా అవసరంలేదు.

అప్పటికే ఆవిడపేరు తెరమీద ఒకటిరెండు తడవలు పడింది. తరువాత వీళ్లు ముగ్గురూ సేటు ఇంట్లో కలుసుకున్న అనంతరం అనేక తడవలు పడింది.

ప్రొడ్యూసరే కథ వ్రాసి చింతామణి పేరపెట్టడం....డైలాగులు రెండర్థాలు వచ్చేలాగా బ్రహ్మాండంగా వ్రాసి పారేయటంలో చింతామణి నిపుణురాలు.

అనాది కథల్లో చివరి గాథ ఏదో ప్రపంచానికి తెలియక పోవచ్చును. అయినా ఏ కాలంలో ఏ స్త్రీ జీవించి ఉంటే ఆ స్త్రీ ఈ తన కథని ప్రదర్శిస్తూనే ఉంటుంది.

అయితే ఆ ప్రదర్శనాన్ని చూసే శక్తి చాలా అవసరం. అలా చూడగలిగిన రోజున ఈ ప్రపంచమే ఒక రంగస్థలం అవుతుంది.

## 13

త్రివేణిలో ఉన్న ముగ్గురికీ గానం- నటన- రచన....రావు. అందుకే వాటి విషయంలో వాళ్లు చాలా జాగ్రత్తగా ఉంటారు. కళ అనేది లొంగతీసుకోపోతే కాటేస్తుందని వారికి ఒక కవిసమ్రాట్ చెప్పారట....ఆ విషయాన్ని రచయిత్రి అయిన చింతామణి ఎప్పుడూ మర్చిపోదు. తను మర్చిపోకపోవటమే కాక మిగతా ఇద్దర్ని మర్చి పోనివ్వదు. ఆమె అసలు కలం పట్టుకోటం చేతగానిది కాదు. కళలు అవినీతికి మూలం అనే సిద్ధాంతాన్ని నమ్మేదీ కాదు. కాని ఊహలు ఒక మార్గంలోనూ, కలం మరో మార్గంలోనూ, వాక్యాలు తుంపులు గానూ అఘోరించేవి.

అయితే ఈ మార్గం సినిమా రచనకి అనుకూలమయిందని గ్రహించటంవలనా, తెలివిగలదవటం వలనా అందులో రాణించటం ప్రారంభించింది....మధ్య మధ్య విచారం అనేది ఫాక్టరీ పొగలాగా చుట్టబెడుతూనే ఉంది—ఏమిటీ బ్రతుకు? దీనికి అంతం ఎక్కడ? ఆ

ఇద్దరిలో ఎవరికి కోపం వచ్చినా తన గతి ఏమిటి? అనే సందేహాలు వెంటాడేవి. బ్రతుకు అసంపూర్ణంగా కనిపించేది. తన బ్రతుకుకే కాదు, ఈ నాటి తార విపులకీ అంతే.

విపుల జీవితాన్ని గురించి, వెంకటేశ్వరి కాకముందు నుంచీ చింతామణికి తెలుసు.... అప్పులు.... వెంకమ్మ కాక మునుపు విపుల పేరదే ... విశాఖపట్నం సముద్ర తీరంలో అప్పులు చేపలు కొని మారుబేరానికి ఊళ్ళో అమ్ముతూ ఉండేది. మోకాళ్ళపైనించి వెనక్కి గోచీ పోసి కట్టిన చీరా, దండలకి సత్తు కడియాలూ, మెళ్ళో ఎర్ర పూసలపేరూ, నోట్లో చుట్టా- ఇదే అప్పట్లో అప్పులు అవతారం. రవిక అనేది ఎరగదు.

"బావ్....కుసిన్ని సేపలు కొనరెట్టండి, ఇంటికాడ ముసలోడికి కూడ్లేదు ఏటీనేదు" అనేది తల రెండు చేతులతో బరుక్కుంటూ. అప్పట్లో ఆ మాటలే పాటలయినట్లు కుర్రకారంతా ఆశ్చర్యపోయే వారు. దానికి కారణం అప్పులు అందకత్తె. ఇంట్లో ఉన్న ముసిలివా డెవరంటే దానికి చిమ్మాద్రప్పన్న ఇచ్చిన బగమంతుడు- మొగుడు. ఆడికి మూడో పెళ్ళి పెళ్ళాం అప్పులు. అయితేనేం ఆడికి అనుమానం నేదు, ఏటీనేదు. ఆడు మంచోడు.

అందువలన అప్పులు డబ్బులు తక్కువిచ్చి, అందచందాలు ఎక్కువిచ్చి చేపలు కొని అమ్మటానికి బస్సులో బయలుదేరి వెళ్ళటం అదో తిరణాల- రెండు చేతులూ పైకెత్తి గంప నెత్తిమీద పెట్టుకొని- ఇటు నడ్డితో అటు నడ్డితో దారిచేసుకొని కండక్టర్ని ఒక్క తోపుతోసి డ్రైవరు వంక చూసి చిరునవ్వు నవ్వి క్లీనరు వంక తిరస్కారంగా చూసి మహారాణీ ఠీవితో మత్స్యగంధి వాసనతో ముంతంత కొప్పుతో మగ దౌర్భాగ్యులలో కోరికలు ఉవ్వెత్తురగా అప్పులు ఆ జనతా ఎక్స్ ప్రెస్‌ని ఆరోహించేది.

ఆ రోజుల్లో పంచరత్నాలూ ప్రార్థన పద్యాలూ వ్రాసేకవిగా

రొకరు... జెండాపై కపిరాజు పాడే గాయక సార్వభౌముడొకరూ.... మొక్కజొన్న తోటలో పాటకి నాట్యం నేర్పే నాట్యకారుడొకరూ- ఈ ముగ్గురూ కలిసి అవూరి సెట్టిగారమ్మాయికి విద్య ప్రసాదించటానికి వెడుతూ అదే బస్సులో ఎక్కి ఎవరికి వారు తమ కళానాయికగా ఊహించుకునేవారు-కథానాయిక కాదు, కళానాయిక! వీళ్ళ వాలకమూ వ్యవహారమూ చూసి అప్పులుకి ఆశ్చర్యంగా ఉండేది. అప్పులు పుట్టి పెరిగిన వాతావరణంలో ఇలాటి వాళ్ళు మచ్చుకైనా లేరు— ఎండు చేపల్ని నిప్పులమీద కాల్చుకుని తింటూ గంజి తాగి పనిలోకి పోయే మగవాళ్ళూ ...తిండిలేక పోయినా తిరగేసి చుట్టకాల్చే ఆడవాళ్ళూ-చేప బొమికల్ని పీక్కుతినే పసిపిల్లలూ... ఇరవయి నాలుగు గంటలూ తగూలాడుకునే ఆలుమగలూ- తుపుకూ తుపుకూ ఉమ్మేస్తూ అందర్నీ తిట్టే ముసిలాళ్ళూ- రోగమూ- ఆకలీ- మురికీ- బీదతనమూ.

ఇందులో కొంత నయం ఏమిటంటే యవ్వనంలో ఉన్న ఆడపిల్లలు అట్టే శ్రమ పడనవసరంలేదు. తలుపులమ్మ అన్నట్లు"ఏపులో ఉన్న ఆడదాయి కలికితే కూటికేటి తక్కువరా ఎంకటేసూ" అని.

తెలిసి అనుభవంతో ఈ మాట చెప్పింది తలుపులమ్మ.... సముద్రంనించి స్మగుల్డ్ వస్తువులు చేరేసే కూలీలకి అప్పులు అధికాకర్షణ కలిగించేసింది. మహాజనానికి మరదలుపిల్ల.... అదేమి చిత్రమోగాని వెనక్కి తిరిగి నడుస్తుంటే జఘన సుందరి- అప్పులు.అందరికీ సరిసమానంగా ఆకలి తీర్చి, అయిదారు రూపాయలు సంపాదించే అందాల పంచదార అప్పులు.

ఒకసారి అప్పులు మహారాణిపేటలో నల్లమందుచేరేసే పనిలో నియోగింపబడి పోలీసుకి పట్టుబడ్డది....ఆ పోలీసు అప్పులు అందం చూసి సంభాషణలోకి దింపి "ఏపే కుర్రగుంటా, నీకేటి పోయేకాలం వచ్చినాది?....నాను గవురుమెంటోళ్ళ నౌకర్ని—ఇక్కడ నాయమేటో తెలవదంటే? పాసిక్యూటరు ఇదే న్యాయం అంటాడు, పీడరు అదే న్యాయం అంటాడు. మేత్రీటు అడిదే నాయమంటాడు. అసలు

నాయమేటో నీకు తెలుసా అంటః తెలవదు. ఎవురికీ తెలవదు. నీకూ తెలవదు. నాకేది నాయమంటే అదేనాయం....ఏటంటావుః"

"సచ్చినోడా, నేనెవురో నీకు తెల్చునురాః తెలవదు. నా నప్పుల్ని, అప్పలమ్మని....తన్నినానంటే ఎ్రరబుట్ట ఎగురుతాది" అంది అప్పులు కాళిక అయి.

"ఏటేః....నాను బయపడతానంటే గుంటాః నీవు కట్టాలు పడ్డావే, అందుకని ఎదిరి త్తన్నావు....కాదంటేః"

"కట్టాలా....నీ యాలి తాడు గుట్టకింద తెంపేసినాక కట్టాల నుబవిత్తా్రనా....అవు్రనా,అనుబవించాను. అదంతా కిందటిజలమంలో- నాను ఆడదాయిగా మడిపిగా ఉండేటప్పుడు. ఇప్పుడు లేవు. నాను ఆడదాయినికాను, మడిసినికాను, అయిదేల్ల నుంచి ఉప్పుసేపల అప్పిని....అదేటదిః నరకంరా—నీకేటి తెలుసు నరకం చంగతిః"

"పిలక బాగా పలుకుతున్నాది. ఏటే నరకం అంటేః"

"ఎందుకురా పోలీసు గాడిద కొడకాః నరకం సంగతి నీతో పేలినానంటే సొరగంగా ఉన్న నరకం సేపల దుకానం కన్న సీకష్టై పోద్దిరా ఎదవ నాయాలాః"

"నీ మాటలు నమ్ముతానే రంగుల పిట్టాః సెప్పు నీ చంగతి. స్మగుల్డ్ గూడుచు చేరేసినందుకు మరో పోలీసోడయితే నాసామిరంగా నిన్ను నరకంలో తోసేసినాదన్న మాటే. నాను గనక దయతల్చినానే గుంటాః"

"నంజనాయాలా, ఏటిరా నీతో సెప్పేదిః నీక్కావల్చింది తీసుకొని నన్నొదిలేస్తావాః ఒదిలీవు. కారనం ఏటీ అంటే ఏటీనేదు. అదంతే....నాకూ మాయమ్మకీ సక్కని గుడిసుండేది. సేపల గంపలు

నాలుగుండేయి....గుడెచెమీద గుమ్మడి తీగుండేది. అది పెద్ద పెద్ద పూలుపూచేది. పూత్తే ఎలా ఉండేదో తెల్సా? గుండెకాయికి గాలం యేసినట్టుండేది. నీకు తెలుచా....తెలియదు. నీకేటీ తెలియదు.... తెలిత్తే పోలీసెందుకు అప్పతావు?....మా అమ్మ .. బలే దొంగనంజ. ఎంతో మంచిది. పిమ్మాద్రి అప్పన్నంటే అమ్మకెంతో బకితి. అందుకే నాకా పేరెట్టిందిరా అది....దానికిజబ్బు.. తింటానికి ఏటీనేకపోయింది, ఆమపటాల్లో తగిలేశారు. పచ్చి సేపలు కాల్చి పెడదామని చముద్రం ఒడ్డుకి ఎల్లాను. అక్కడోటూడెంటు నాయాల నన్ను పట్టుకున్నాడు.... ఏటిరా, ఇంటన్నావా? నీకేయాలప్పుడన్నా ఇలాటి కట్టం ఒచ్చినాదా? నీ ఆడదాయిని ఎవులన్నా అట్టుకున్నారా? నేదు. నివ్వు జాగర్తగా దాన్ని కాపలా కాత్తావు. అప్పుడేటి సేసానో తెలుచా?"

"ఏటిసేసినావు?....అగ్గి ఉంటే ఇయ్యే!"

"ఏటిసేసినానా? ఏడిసినాను....నీకు నాయంటి ఆడ బుట్టువులు లేరా అని ఏడిసినాను....ఆడు నవ్వాడు....మరో ఇద్దర్ని కూకెట్టి నాడు....నీ పాదాలట్టుకుంతాను బాబూ, అని ఏడిసినాను."

ఇంతవరకూ చెప్పినాక ఏడవటం ప్రారంభించింది అప్పలు. పోలీసుకి ఇలాటి కథలు చాలా తెలుసు. ఈ చేపల పిల్ల కథతో మరో కథ. అతనాట్టే చలించక-

"సెప్పే, ఏటయినాది?" అన్నాడు.

"నన్ను రూముకి పురుగునాగా తీసికెల్లినారు. అదివరకు మడిసిని. అప్పుడు పురుగు నయినాను....నన్ను తాళ్ళతో కట్టేసి నారు... కొరడా యెట్టి కొట్టేసినారు. తినటానికి ఏదో ఎట్టారు. ఓడి నడుం ఇరగొట్టా. ఇంకోడి కాలు మెలి తిప్పేసినాను....నాను దెయ్య మయినాను....తిండినేక సచ్చేకన్న అదే నయం అనిపించీసినాది.... కాదురా కటికి ఎదవా, నివ్వే సెప్పు ఏదోటిసేసి తింటంమేలా? సావటం మేలా? ఓర్రానన్ను ఇలా సేసింది?"

"మీయమ్మ ఏటయినాది?"

"ఆ రేత్తిరే సచ్చిపోనాది, పీడా పోయింది. ఏటికది బతికి సావటం? బతికుంటే సచ్చుండేది...సచ్చింది కనక బతికి పోయి నాది....అప్పుడునించి ఈ పని సేత్తున్నాను ...ఆ ముసలోడు ఈ పెట్టిలో తన పాణాలుంటాయన్నాడు. అడియమ్మ ఇచ్చినాదా? నాయమ్మ చంగతి ఓడూ మాట్టాడ్డు....మాయమ్మ నాకేటీ ఇచ్చి సావనేదులే.... అచలెవుడేమిచ్చాళ్ళే? ఆల్లకి ఒల్లు కావాలి. నాకు గంజినీల్లు కావాలి. ఏటితప్పు? ఇదేటి తప్పురా? ఒరేయ్ పోలీసూ? ఎట్రా, జల్లసేప నాగ మెత్తపడి పోతన్నావూ? నాయాల. నిన్నుచూ స్తే మిగతా పోలీసోల్లు నవ్వరంట్రా? ఇంత సేతకాని ఎదవ్వు నన్నెందు కట్టుకున్నావూ అంట?"

"కాదే....నేను పోలీసుని....నివ్వు అప్పివి. ఏటే బేదం మని ద్దరికీ?....అసే-నాను యింకో పని సెపతా—కుదురుకుంటావూ?"

"జేలు కెల్లొచ్చినాక నేటిరా?"

"కాదే-ఇప్పుడే. ఆ నల్లమందు ఆతల పారేసిరా- పోదాం."

"ఎట్రా నివ్వంటున్నది?"

"నిన్ను పనిలో ఎడతా."

"నివ్వు పోలీచువి కాదురా-బగమంతుడివి. పైడి తల్లివి. చిమ్మాద్రప్పన్నవి-ఎల్దాం పదహే."

# 14

అప్పలుకి బస్సులో ఎదురయ్యే కళాకారులు ఏ సెట్టిగారింట్లో పనిచేస్తున్నారో ఆ ఇంట్లోనే అప్పలుకి పని కుదిర్చాడు పోలీసు.

వాళ్ళింట్లో పనిచేసి.... అంటే-సెట్టిగారి కూతురుకి నీళ్ళోసి బట్టలు తొడిగి కవిగారి దగ్గర పై్రివేటుకి కూర్చోబెట్టేది.... మధ్యాహ్నం సంగీతం చెప్పించుకునేందుకు తయారుచేసేది .. సాయంత్రం నాట్యానికి అలంకరించేది.

ఇంట్లో ఇల్లాలు లేదు.... నరసింహులుసెట్టి మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు. ఇల్లు వంటావిడకి అప్పచెప్పి ఊరూరూ తిరిగేవాడు వ్యాపారం మీద. ఇంతలో కవిత్వం వ్రాసే కన్యశ్రీ కన్ను అప్పులుమీద బాగా పడింది. మిగిలిన కాస్త అన్నమూ అప్పులుకీ దాని ముసిలి మొగుడికీ సరిపోదు కనక అడపా దడపా అర్ధ రూపాయి డబ్బులు ఇస్తూవుండేవాడు. అప్పులు చిరునవ్వు నవ్వుతూ పుచ్చుకునేది. దానికీ నాగరికత పెరిగింది. ఈ మధ్య రవిక తొడగటం నేర్చుకుంది—వాలు జడవేసి రిబ్బను పెడుతోంది. మెళ్ళో చౌకబారు నల్ల పూసలు కంఠానికి ఉరిలా వేసుకుంటోంది—కాటుక పెట్టుకొని హిందీ చినిమాటారులా తయారవటం, నోరు మూసుకుని నాగరికతగా ప్రవర్తించటం కాస్స నేర్చుకుంది.

దాంతో కన్యశ్రీగారు అప్పులంటే ఆసక్తి చూపించటం ప్రారంభించాడు—ఆయన కవితా హృదయానికి ఆమె కావ్యనాయిక. ఒకరోజు ఆమె ఒంటరిగా ఉండగా దగ్గర చేరాడు.

"అప్పులూ!"

"ఏటయ్యగోరూ?"

"నువ్వు చాలా అందమైన దానివి. మా వూళ్ళో ఒక సినిమాతార ఉండేది-అచ్చం నీలాగా ఉండేది."

"అయ్యగోరూ, అసలు మీ ఊరేది?"

"నా ఆత్మకథ వింటావా అప్పులూ.... అదే నా ప్రేమకధ.... నేను లాలసని ప్రేమించాను" అన్నాడు ఆవేశంగా.

"పనిలేదు చెప్పండి" అంది ఆవలిస్తూ అప్పులు.

"లాలస నా జీవిత సర్వస్వం, నా ప్రాణము, నా ఆత్మ, నా ప్రేమ, నా పాపము అన్నీ....అన్నీ....యింకా చెప్పలేను. నా పెదవులమీద లా-ల-స అనే మూడు అక్షరాలు నాట్యంచేస్తూ ఉంటయ్.

"నాలుగు అడుగుల పదంగుళాలు ఎత్తు, గులాబి రంగు కలిగిన లాలసను బళ్ళోను యింట్లోను లాలి అంటారు కాని, నా ఒడిలో ఆమె ఎప్పుడూ లాలసే. నేను పుట్టిన మూడు దశాబ్దాల తరువాత పుట్టింది లాలస. ఆమెకు నాకు వయస్సులో అంత తేడా వుంది."

"తొందరగా చెప్పండి" అంది అప్పులు.

"నేను 1930 వ సంవత్సరంలో పుట్టాను. మా నాన్న స్వచ్ఛమైన తెలుగువాడు. మా అమ్మ బెంగాలీ, మా పూర్వీకులు ఆంధ్రదేశం నుండి ఉత్తర హిందూస్థానంకు పొట్ట చేతపట్టుకొని వెళ్ళారు. మా తండ్రిగారి పైమొచ్చేటప్పటికి అక్కడే స్థిరపడిపోయినారు. మా తాతలు పెత్తండ్రులు రకరకాల వ్యాపారాలుచేసి పొట్టనింపుకున్నారు. మా నాన్న నేను పుట్టేటప్పటికే ఒక పెద్ద హోటలు నడుపుతూ ఉన్నాడు. మా హోటలు ఒక ఎత్తైన కొండమీద వుంది. చూడడానికి చాలా ముచ్చటగా వుంటుంది. ఎటు చూచినా లోయలు. లోయలంతా పచ్చికతో నిండి, వాటిమీద మంచు పేరుకుని వుంటుంది. మా అమ్మ చాలా అందకత్తె. మా నాన్న మా అమ్మను తన ముప్పయ్యోయేట పెళ్ళి చేసుకున్నాడు. మా అమ్మ ఒకసారి పిక్నిక్‌కువెళ్ళి యాక్సిడెంటయి మరణించింది. అప్పుడు నా వయస్సు మూడేళ్ళు మాత్రమే. మా అమ్మపోయిన కొద్ది రోజులకే మా అమ్మ అక్కగారు మా యింటికి చేరింది. మానాన్న దాయాదులలో ఒకాయన ఆమెను చేసుకుని తర్వాత వదిలేసి అమెరికాలో స్థిరపడిపోయారు. యిరుగు పొరుగు అందరూ మా పెద్దమ్మకు మా నాన్నకు యిదివరకే సంబంధం వుందని అనుకునేవారు. మా పెద్దమ్మ గయ్యాళి. ఆవిడ

పద్ధతులు చాలా తీవ్రంగా వుండేవి. ఏవి ఏమయినప్పటికి ఆవి డంటే నాకు యిష్టంగానే వుండేది. ఆవిడ పాలిపోయిన ఎర్రరంగులో ఉండేది. చాలా మూఢ నమ్మకస్తురాలు. నా పదహారవ ఏడు పుట్టిన రోజయిన తర్వాత చచ్చిపోతాన్రా అంటూ వుండేది. అలాగే చని పోయింది.

"నేను పుట్టి పెరిగిన వాతావరణము చాలా ఆహ్లాదకరమైనది. పుష్కలంగా డబ్బున్న యిల్లు. మంచి బట్టలు, రకరకాల ఆట వస్తు వులు. ప్రకృతికి పుట్టిల్లయిన పరిసర ప్రాంతాలు నాకు కలలో విషయాలు. తల్లి లేకపోవడంవల్ల తేలికగా ఉండేది. అందరూ నన్నెత్తుకుని ఆడించేవాళ్ళు, ముద్దెట్టుకునేవాళ్ళు. మా నాన్న నన్నెత్తు కుని రకరకాల కధలు చెప్పేవాడు. మంచి మంచి ఖరీదయిన వస్తు వులు కొనిచ్చేవాడు. బళ్ళోకి వెళ్ళే యీడు రాగానే మంచి కాన్వెం టుకు పంపించాడు."

"మరి ప్రైవేటులు సెప్పుకుంటున్నారేం?"

"విను మరి. కాన్వెంటులో చదువుకునే రోజుల్లో డాన్ క్విక్ సోట్ కథల పుస్తకము, లేమిజరబిల్స్, చార్లెస్ డికెన్స్, డేవిడ్ కాపర్ ఫీల్డు, ఆలివర్ట్విస్టు మొదలైన పుస్తకాలు చదివాను. చదువుతో పాటు స్విమ్మింగ్ఫూల్లో యీతకొట్టడం, చెట్లెక్కడం, తుపాకితో కొట్టడం నేర్చుకున్నాను."

"తమరు పిట్టల్ని కొడతారా?"

"అప్పుడప్పుడు. మా పనివాళ్ళు మా నాన్న తన అందమైన ఆడస్నేహితులతో తిరగటం మొదలయినవి చెప్పుకుని నన్ను గూర్చి విచారపడుతూ వుండడం కూడా నా చెవిని పడుతూ వుండేది ఖర్మం.

"స్కూల్లో నేను క్రికెట్, ఫుట్బాల్, హాకీ మొదలైన ఆటలు

బాగా నేర్చుకున్నాను. నేనంటే నా తోటి విద్యార్థులకు, మా టీచర్లకు చాలా యిష్టం. ఆటలతోపాటు చదువులలోకూడా నేనే ఫస్టు. నా పదమూడవయేట మాత్రం ఒక చిన్న ప్రేమ వ్యవహారం నడిచింది. ఆ విషయం మా నాన్నకు తెలిసి నాకు సెక్సును గురించి మొదటిసారిగా ఒక ఉపన్యాసం యిచ్చాడు. తరువాత మా నాన్న ఆ యేడు వేసవిలో ఒక భాగ్యవంతురాలూ, ఆమెకుమార్తెతో దేశాలు చూట్టానికి వెళ్ళాడు. కనీసం నాతో చెప్పనైనా చెప్పలేదు."

"మొత్తానికి భలేవాళ్ళే! మీతో ఎందుకు సెప్పాలి?"

"ఆనీ భావుకురాలు....నిజం చెప్పాలంటే నా మాదిరిగానే విభిన్నభాషాసంస్కృతులకు చెందిందే....అంటే-ఆమె తల్లి ఆంగ్లో ఇండియన్, తండ్రి గడ్డం పెంచి సాంప్రదాయం వదలని సిక్కు. ఆనీ పోలికల్లో ఈ ఇద్దరూ కనిపిస్తారు.

"నేను లాలసని చూడకముందు నా మెదడనే లాబొరేటరీని ఎప్పుడు తెరిచినా ఆనీ ఒక ఎక్స్‌పెరిమెంట్ కింద కనపడేది. నున్నగా తేనె రంగు శరీరం, సన్నని భుజాలు, రాగిరంగు జుట్టు, చక్కని పెదిమలు....కళ్లు తెరిచినా నీడలు పారుస్తూ దర్శనమిచ్చే ఆనీ....బాల్యంలో యవ్వనానికి దారిచూపిన ఆనీ....

"చిత్రం ఏమిటంటే లాలసకి ఆనీ మాతృక. ఆనీని వర్ణించాలంటే నన్ను నేను కంట్రోలు చేసుకోలేని స్థితిలో పడతాను.

"ఏది ఏమయినా ఈ మెత్తని, తీయని భవిష్యత్ స్త్రీ నాకంటే క్లాసులో వెనకబడే ఉండేది.

"జ్ఞాపకాల అడుగుపొరల వెనకాల అమె చిక్కగా పేరుకు పోకముసుపే బాల్యప్రభావం పూర్తి అయిపోవచ్చింది....చిన్నతనంలో జరిగిన విషయాలు బాగా జ్ఞాపకం ఉంటాయి.

"ఎంత బాగా జ్ఞాపకం ఉంటాయంటే పర్వతపాదం కన్నా బరువుగా.... వేసవిధూళికంటె విసుగ్గా—వెచ్చగా—వెన్నెలగా.... సరే...."

"ఏమిటో గోల- విదరోకుండా?"

"ఇది గొప్పవాడి ఆత్మకథ. ఇది వినే తీరాలి. చిన్నప్పటి నుంచీ ఆనీకి నర్సుగా ఉండి సేవ చెయ్యాలనీ—నాకు డిటెక్టివ్ పోలీసు అవాలనీ కోరికలుండేవి—హఠాత్తుగా వచ్చిన మా ప్రేమ ప్రవాహం తెలిసీ తెలియని వయస్సవటంవలనా—ఎలా కలుసుకోవాలో తెలియక పరిపక్వం కాలేదు. ఇలా ఉండగా, ఒక శుభదినాన తోటలో ఎదురయ్యాం.

"ఆ బాల్యయవ్వన సంధిలో అర్థంకాని బలమైన వాంఛ ఏదో రక్తనాళాల్ని చిట్లకొట్టటంవలన సగం భయంతో, సగం కుతూహలంతో ఒకరినొకరు ఆధారం చేసుకొన్నాం. ఆ తరువాత అప్పుడప్పుడు కలుసుకొనేవాళ్ళం. ఇన్నాళ్ళ తరువాత ఆలోచిస్తే అదే జాత్యం-'సెక్సు' అనిపిస్తోంది.

"ఎంత చెప్పాలని లేకపోయినా-కళ్ళు ఎంత చెమ్మగిలుతున్నా ఈ విషయం చెప్పక తప్పదు. కొద్దిరోజులకే జ్వరం వచ్చి ఆనీ కథ ముగిసింది—ఆ తరువాత చాలారోజుల వరకూ ఆమె జ్ఞాపకాలూ, ఆమె వెచ్చని నెత్తురూ, ఆమె తీయని అవయవాలూ నన్ను వదలలేదు ...లాలసా, నువ్వు అలా ఆరాధించగలవా?"

"ఆహా, ఆడదాయి కాదా?" అంది అప్పలు.

"ఆనీతో గడిపిన ఆ తీయనికాలం కాలుస్తూ జ్వరంలాగా నన్ను వేధించేది....ఇన్నాళ్ళ తరువాత వెనక్కి తిరిగిచూస్తే గడిచిన పడుచుదనపు కోలాటం—పట్టాలపక్కన పచ్చిగడ్డిమీద నిలిచిన మంచు

బొట్లని రైలు ప్రయాణీకుడు చూసినట్లుగా ఉంటుంది. అలాగే జారి పోయింది. ఢిల్లీలో విద్యార్థిగా ఉన్నప్పుడు అనుభవాన్ని అద్దెకు తీసు కున్నాను—అప్పట్లో స్థిరమైన అభిప్రాయాలు లేవు—డాక్టర్ని కావా లని కొన్నాళ్లు,రచయితని కావాలని కొన్నాళ్లు ప్రయత్నించాను. నేను వ్రాసిన కొన్ని వ్యాసాలు కొంతమంది పండితుల్ని ఆకర్షించినాయి- కదా అని వాటిని ప్రచురించారు పబ్లిషర్లు.

"కొన్నాళ్లు వయోజనవిద్యకి ఉపాధ్యాయుడుగాఇంగ్లీషుచెపుతూ డెహ్రాడూన్‌లో గడిపాను. ఒక స్కూలు మాస్టరుగా ఇంకో బడిలో రెండేళ్లున్నాను— ఇంతలో లోకాన్ని సంస్కరిద్దామని బుద్ధి పుట్టి, అనాథశరణాలయాన్ని, శరణార్థుల సంఘాన్ని చూసి నేనూ ఒక సమాజాన్ని స్థాపించాను. దాని పనేమిటంటే- ఇదివరకున్నట్లు గానే పతిత జనోద్ధరణ. అయితేనేం? అంతలోనే మరో బ్రెయిన్ వేవ్ వచ్చింది.అదేమిటంటే- పదీ పన్నెండేళ్ళ మధ్యనున్న ఆడపిల్లలు తమకంటె మూడురెట్లు వయసున్న పురుషజనంతో వాంఛకాని దగ్గర తనాన్ని పెంచుకొని అర్థరహితంగా, నీచంగా జీవించటం. స్కూలు నుంచి పరుగెత్తి పార్కుల్లో అలాటివారి ఒడిలో కూర్చోటం. అకాలంలో మగ్గేసిన పళ్ళు రుచి లేకుండా తయారయినట్లు తయారవటం చూస్తున్నాను.

"ఆ వయసులో పొంగే కోరికలు....అంటే సినిమాలూ, రిబ్బన్లూ, గాజులూ వగైరాలకి తల్లితండ్రు లివ్వరు కనుక....పబ్లిగ్గా పార్కుల్లో వాళ్ళఒళ్లో కూర్చున్నాగాని చిన్నపిల్లలని ఎవరూ లెక్క- చెయ్యరు గనుకా ఆడపిల్లలు భయపడరు.

"ఇంకో సంగతి........యవ్వనంలో వాంఛలు తీర్చు కోటం అసహజం కాదు- కాని పదేళ్ళ పిల్లని ఆశించటం అసహజం. అదే జరగటం చూస్తున్నాను ఇప్పుడు—ఇండియాలో ఈ పెర్వర్సిటీ బయలుదేరటం రచయితను కనుక నాకే ముందు కనిపించిందను

కుంటాను— ఒక విధంగా ఆలోచించి చూస్తే ఇది కొత్తకాదేమో అనిపిస్తోంది. వయోభేదపు ప్రేమలూ, వాంఛలూ చరిత్రలో చాలా కనిపిస్తాయి.

"ముసిలాళ్లు చిన్నపిల్లల్ని డబ్బిచ్చి కొనుక్కోటం-దాన్ని కన్యా శుల్కం అనటం మనకి తెలుసు.... రాధ కృష్ణుడికన్నా పెద్దది— ఒక ప్రసిద్ధ నటుడు పెళ్ళాడిన నటి అతనికన్నా వయస్సులో చాలా చిన్నది. అయితే ఇది సహజమో, విరుద్ధమో- ఇంకా అంతుబట్టటం లేదు....

"అప్పుడప్పుడు నాకు ఆశ్చర్యం వేస్తుంది. ఈ చిన్న కిన్నెర బాలల భవిష్యత్ ఏమిటా అని—ఈ దిక్కుమాలిన ఉక్కు లోకంలో వీళ్ళకి లభించేది ఏ తుప్పు వస్తువులో అని. వీలయితే వాటిని లేకుండా చేసి వీళ్ళ జీవితాల్ని బాగుపరచాలనే ఉంది. సరే- తెగించ తల్చు కున్నాను.

"ఒకరోజు బజారులో ఆలోచిస్తూ నడుస్తున్న నాకు ఇవ్వా లేదో జరుగుతుందన్న భావం వదలటం లేదు- అర్థంలేని గతకాలపు స్మృతులన్నీ మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం వచ్చి-నువ్వు మా వాడివి అంటూ వేసవికాలంలో మిణుగురు పురుగులలా మెరవటం ప్రారంభించినయ్- అప్పుడే జీవితపు ప్రథమాధ్యాయం ప్రారంభమయినట్లు తోచింది— పసితనపు అమాయకత్వం తాలూకు ఒంటరితనంలో చేసిన రోదనం- దేనికోసమో ఆరాటించటం ఉద్దేశాలు కదిలికలు జ్ఞాపకం వస్తు న్నాయి. సెట్టిగారింటికి వచ్చేసరికి నువ్వు కనిపించావు."

కన్యశ్రీ అమిత ఆవేశంగా చెప్పిన కథకి అప్పులు ఆనం దించలేదు సరికదా, అర్థంకూడా చేసుకోలేదు. పతిత జనోద్ధరణ— జీవితపు ప్రథమాధ్యాయం- విభిన్న భాషా సంస్కృతులు- మొదలైన కొన్ని పదాలు వచ్చినా అర్థంకాలేదు. అసలేమీ అర్థంకాలేదు. అయినా

ఆమె ఆడతనపు ఆశ్చర్యం వలన ఈ అయ్యగారు దేనికో గేలంవేస్తు న్నాడని మాత్రం గ్రహించింది. అదేమిటో తెలుసుకోకుండానే తిర గలి మీద తలపెట్టుకుని నిద్రపోయింది అప్పులు.కన్యశ్రీ ఏంచేయాలో తెలియక సెట్టిగారి కంఠస్వరం విని సావిట్లోకి వెళ్ళాడు.

# 15

"ఆయ్యోవ్ - నాయనోవ్- డాన్సాడే అయ్యవోరు రైలు కింద తలపెట్టి సచ్చినాడేవ్!"బయట హడావిడిగా కేకలు వినిపించేసరికి అప్పులుకి మెలకువ వచ్చింది.మొదట్లో అసలేం జరిగిందో అప్పులుకి అర్థంకాలేదు. ఈ కవిగారి సొదకి ముందు అదేదో చినిమా నరతన శాలలో ఎన్టీ రామారావు యేసంలాగ ఆ డాన్సు అయ్యవోరు గెంతిండు. ఇంతలోకే సచ్చినాడు- అందులో రైలు కింద తలపెట్టి మరీని. అప్పులు పరిగెత్తింది.

మెడకాయి రైలు పట్టాల కివతల- అవతల చక్రాల కవతల కాళ్ళు- ఈ రెండు ఒంటరి పట్టాల మధ్యా మొండెం- ఇందాక ప్రాణం ఇప్పుడులేదు. అప్పి అనేక చావులు చూపిందిగాని ఇలాటి చావు దాని జన్మలో చూళ్ళేదు. ఎందుకో జాలేసింది. హడావిడి పడుతూ వింత చూడటానికి వచ్చిన కన్యశ్రీని చూస్తే అసహ్యం వేసింది.

"నాకు కళ్లు తిరుగుతున్నాయ్!" ఒక మనిషి.

"ఓలమ్మో,నిండు పానం పోయినాది దేముడోయ్!"ఒక ఆడ మనిషి అర్థంలేని ఏడుపు.

'చచ్చినోడు ఎవుడో ఎవురికన్నా తెలుసా బాబూ?" ఎవరో అడిగారు.

"నాకు తెలుసు." తోసుకుంటూ ముందుకు వస్తున్న కన్యశ్రీని చూపి అప్పులుకి ఆశ్చర్యంవేసింది.

సాయంత్రం నాలుగు గంటలయింది. సంధ్యాకాలపు ఎండ విశాఖపట్నంలో అట్టే తీవ్రంగా ఉండదు....అయినా ఆ కాంతిలోనే జనంకాళ్ళ కిందనుంచి చూస్తే డాన్సాడే అయ్యవారి చచ్చిన పాదాలు కనిపిస్తున్నాయ్. ఎన్నాళ్ళు గెంతినయ్ ఆ పాదాలు? ఎన్నాళ్లు ఆ శరీరాన్ని మోసుకుంటూ నడిచినయ్!

ఏమో గోల...దూరాన్నుంచి చూస్తూంటే రైలుపట్టాలు ఎన్నడూ కలియని స్త్రీ పురుషుల్లా, త్రాచుపాముల్లా, విపణిలో నిలుచున్న ఆడదాని రెండుజడల్లా కనిపిస్తున్నాయి. అయోమయంగా నిలబడ్డ పోలీసు చుట్టూ నల్లచుక్కల్లా నిలబడ్డారు జనం. అసహ్యం- ఆశ్చర్యం-అలసట-కుతూహలం.

"ఇహ నేను నిలుచోలేను. కళ్ళు తిరుగుతున్నాయ్!" ఎవరో అన్నారు- వీడికళ్లు తిరిగితే ఎవరికి కావాలి?వీడు చస్తే మాత్రం ఎవరికి కావాలి-వాడు చస్తే ఎవరికి కావాల్సి వచ్చింది గనుక? లోకానికి చావంటే ఎంత భయం? అప్పులు తనలో తనే నవ్వుకుంది. చచ్చిపోయినాడు....తన తల్లి చచ్చిపోయింది. ఈ లోకంలో ఎంతో మంది చచ్చిపోతున్నారు. రేపు తనూ చచ్చిపోతుంది. అప్పులుకి భయమేసింది.

పాపం, అతను ఇహ ఏమీ చూడలేడు. నెత్తురులో తడిసిన కనురెప్పలు మరి తెరుచుకోవు- ఆ కాళ్ళు మరిహ నడవ్వు. డాన్సాడవు. బ్రతుకులో వెలుతుర్ని సీకటిని సినిమాల్ని చూడవు. అప్పులుకి జాలేసింది.

ఆడి మెడనించి తలకాయ అవతల పడిపోయి నెత్తురు కారుతోంది. ఆడి నాలిక ఆ తలకాయిలోంచి వెళ్ళుకొచ్చింది. ఆడి మొల

చివికిపోయి పనసకాయ నిలువుగా కోసి పారాణిలో ముంచినట్లుంది. కళ్ళుమూసుకుని వెనక్కి తిరిగింది అప్పులు. కన్యశ్రీ చివరి పద్యాలు వ్రాయటానికి ఇందాకే వెళ్ళారు. మిత్ర వియోగం అనే శీర్షిక బాగుం టుందా లేదా అని ఆలోచించుకుంటూ, కొంప మునిగినట్లు. కొంపలో దూరిన అతన్ని చూసి అప్పులుకి ఆశ్చర్యంతోపాటు అసహ్యం కూడా వేసింది. అసలీ డాన్సాదే ఆయన అర్ధాంతరంగా ఎందుకు వచ్చినట్లు? ఆ ప్రశ్నకి సమాధానం ఎవరిస్తారు? ఎవరెందుకు వస్తు న్నారో లోకానికి ఎప్పుడూ తెలియదు. అదో సృష్టి రహస్యం.

అప్పులు ఆకాశంవంక చూసింది. ఎర్రగా నెత్తురుతో తడిసి రైలుకింద పడ్డట్లుంది. దూరంగా చెట్లు వెనకాల ఏదో వూరి తాలూకు గుడిసె కప్పులు రైలు కిందపడ్డ అప్పలమ్మల తలకాయల్లా ఉన్నాయ్. గొట్టాల్లోంచి వస్తున్న పొగ చచ్చిన పెదవులు పీల్చక పోవటం వలన ఆరిపోతున్న చుట్ట పొగని జ్ఞాపకం చేస్తున్నది—స్నానంచేసిన ముసిలాదెవరో పడుచుదనంలోచేసిన పాపాన్ని తుడుచుకుంటున్నాడు. చెరువులో కొంగలూ-దూరాన కొండలూ-విరగబూసిన గన్నేరుచెట్టు కొమ్మలూ-వయసుని అమ్మకోటానికి రెడీగా ఉన్న పడుచులూ-గిడస బారిన విపణివీధి-గడవని కూలిపడుచూ-గంపలూ తెంపరులూ-తెగిన తలకాయలూ-నరకమూ స్వర్గమూ-సూర్యుడూ-బాధల్ని భరిం చనూ లేక సహించటమూ చేతగాక ఏడుస్తూ ఎండిన రొమ్ముల్ని పసి బిడ్డ నోట్లోపెట్టి ఆ పక్కనే కూర్చుని అదే రొమ్ములవంక కాపిని పాలయినావస్తే తన ఆకలికూడా తీరుతుందనే ఉద్దేశ్యంతో చూస్తున్న దాని మగవాడూ-వాడి ఆకలీ "వెధవ, తిండి లేనివాడు పిల్లల్ని పుట్టిం చడ మెందుకు?" అనే భాగ్యవంతుడి ఆక్షేపణా-రక్తమూ చినుకులూ!

కెవ్వుమంది అప్పులు.

అప్పులుకి తిరిగీ స్పృహవచ్చేసరికి పెట్టిగారి పర్యవేక్షణలో ఉంది....రవిక తొడుక్కొని కొంత నాజూగ్గా మాట్లాడటంనేర్చుకున్న

ఈ దాసీపిల్ల ఆయన కంటికి అప్సరసలా కనిపించింది-ఆయనకూడా బొత్తిగా స్త్రీనెరగనివాడుకాకపోయినా ఈ అప్పలులో ఉన్న జివ్వున లాగే సౌందర్యం ఆయన్ని ఆకర్షించింది. దానికి అప్పలూ దాని మామాకూడా చాలా సంతోషించారు.

కన్యశ్రీగాని, సంగీతం మాస్టారుగాని ఇహ దాని జోలికి రాలేదు సరిగదా....సినిమాకి పెట్టుబడి పెట్టించమని దాన్ని బ్రతిమాలుకోసాగారు.

"అదేమిటి?" అంది అప్పలు ఎప్పుడోతప్ప దానికిప్పుడు యాస రావటంలేదు.

"ఏం లేదు, సినిమా తీయటానికి అయ్యగారిచేత పెట్టుబడి పెట్టిస్తివా బ్రతికిపోతాం, నా దగ్గర కథ ఉంది....మాస్టారు పాటలు సెటింగు చేస్తారు. నువ్వు హీరోయిను....ఏమంటావు?" అన్నాడు కన్యశ్రీ.

అప్పలుకు విషయం ఏమిటో పూర్తిగా అర్థం కాకపోయినా ఇందులో ఏదో లాభం ఉందన్న విషయం అర్థమైంది....ఆ రాత్రి సెట్టిగారి దగ్గర కదిపింది. ఆయన కొంత రసికుడు అవటంవలన ఎంకి పాటలూ బాపిరాజుగారి నవలలూ తెలుసు. సంగీత సాహిత్యాల మీద ఉండే అభిమానం వల్లనే కూతురుకి విద్య చెప్పిస్తున్నారు. డాన్సు మాస్టరు పోయిన దగ్గరనుంచీ ఆయనకీ మద్రాసు కాపరంపెట్టి కూతురికి డాన్సు చెప్పించటం గురించి ఆలోచనలు వస్తూనే వున్నాయ్.

ఆయనకి అప్పలు శరీరం అంటే తగని వ్యామోహం ఉందన్న సంగతి అప్పలుకే కాదు, ఆయనకీ తెలుసు. ఎంకి పాటల మీద ఉంటే ప్రేమచేత తనని ఎంకీ అని పిలవటం ప్రారంభించి నప్పుడే అది చేవల బ్రతుక్కి స్వస్తి చెప్పింది. సెట్టిగార్ని ఒప్పించ

టానికి వారంరోజులు పట్టినాగాని ఎంకి (మాజీ అప్పులు) వెంకటే శ్వరిగా మారి, సెట్టిగారి అమ్మాయినీ, పంతుళ్ళిద్దరినీ వెంటేసు కుని మద్రాసు చేరింది. విశాఖపట్నాన్ని పెద్ద ఊరనుకునే అప్పులు మద్రాసుని చూసి ఆశ్చర్యపోవటమే కాకుండా ఇహముందు తనిక్కడే ఉంటానని గర్వపడింది. ఏమయినాకాని ఆ ప్రయత్నంలో అది వెనక పడదల్చుకోలేదు- పట్టుదల అనేది దానికి జీవితం నేర్పిన పాఠం.

ఆ సందర్భంలో సెట్టిగార్నొక్కర్నే నమ్ముకోవడడం తెలివి తక్కువని మామ చెప్పిన సలహా దానికి పూర్తిగా నచ్చింది— ఒక రితో చెప్పిన మాట ఒకరితో చెప్పకుండా, ఒకరితో ప్రవర్తించినట్లు మరొకరితో ప్రవర్తించకుండా అది చాలా అద్భుతంగా ప్రకృతి స్త్రీ కిచ్చిన సర్వవరాల్ని ఉపయోగించుకుని తార అయింది....చిత్రం ఏమిటంటే-చదువూ, నాట్యం, నాగరికతా నేర్చుకుని విపులగా మారిన అప్పులుతో మాట్లాడటానికి అందరూ భయపడుతున్నారు. మధ్యలో ఎత్తిన రెండు అవతారాలూ-ఎంకి, వెంకటేశ్వరి- ఎవరికీ గుర్తులేవు.

# 16

ఒక విధంగా చూస్తే జీవితాదర్శం ఏమిటి అనే ప్రశ్నకి చలంగారు చెప్పిన జవాబు కరెక్ట్.

శాంతిని భగ్నంచేసే ఏ సుఖమూ, ఏ గొప్పతనమూ, ఏ శృంగారమూ జీవితానికి చాలా విరోధం. శాంతిని భగ్నంచేసేది సుఖమూ కాదు, గొప్పదనమూ కాదు, శృంగారమూ కాదు అంటారు చలంగారు— పది సినిమాల్లో ఆడిం తరువాత నిద్రతోపాటు శాంతి కూడా లోపించింది విపులకి—ఆ అసురసంధ్యవేళ 'విపుల జీవిత మంతా తల్చుకుని నిట్టూర్చింది చింతామణి.

విశాఖపట్నంనుంచి ఆమెతోపాటు వచ్చిన కన్యశ్రీ మరో పాడే అతనూ సినిమాల్లోనే బ్రతుకుతున్నారు. సెట్టిగారి వీపు మీదుగా కాలేసి జీవన సౌధాన్ని ఆరోహించిన తరువాత ఆ వీపుని మర్చిపోయింది విపుల. చింతామణి నవ్వుకుంది—

ఆ మాటకొ స్తే ఎక్కిన మెట్లు ఎవరు గుర్తుంచుకుంటారు? సావిత్రి పాటా, తన రచనా, విమల నటనా అద్భుతమైనవి కాక పోవచ్చును .. కావుకూడా. కాని, ఆశ్చర్యం ఏమిటంటే అందరికంటె అట్టడుగునుంచి వచ్చిన విపుల అందరికంటె ఎక్కువగా ఉండటం, అందరికంటె ఎక్కువగా జీవితానికిదగ్గరగా ఉండటమే.ఆమెజీవితంతో ఆటలాడలేదు. పోటీపడి దాని వెంబడి పరుగెత్తి దాన్ని అందుకుంది. జంగురు బిల్లిలా తిరగబడే జీవితం ఆమె చేతులో పిల్లికూన అయింది....ఆ జీవన సాన్నిహిత్యమే ఆమెను ఇంత తెలివిగలదానిగా చేసింది.

చింతామణిగాని సావిత్రిగాని విపులలాగా బ్రతుక్కి దగ్గరగా రాలేదు. వాళ్లు ముగ్గురూ స్నేహితులేగాని ఆత్మీయులుగారు.ఆ స్నేహం కూడా డబ్బు సంపాదనకే-ముగ్గురూ కలిస్తే చాలా విలువ సినిమా లోకంలోనని డిస్ట్రిబ్యూటర్లంటారు. ప్రొడ్యూసర్లు తలలూపుతారు, ప్రేక్షకులు చప్పట్లు కొడతారు. ఏమిటంటే అదంతే.

ఇదిలా వుండగా మరో ఆడ ప్రొడ్యూసరు రంగంలోకి దిగింది. ఆమె పేరు లాలస. విపుల నటనకీ, సావిత్రి పాటకీ ఆమె కాంట్రాక్టు కుదుర్చుకుని ఎడ్వాన్సు లిచ్చిన అనంతరం కథ కన్యశ్రీ గారిదంది ఆమె. విపులకి ఏం మాట్లాడాలో తెలియలేదు. తనని ఇలా చేసింది ఒకవిధంగా కన్యశ్రీ గారే. ఆయన కథని ఆపమని తను చెప్పటం కృతజ్ఞత అనిపించుకోదు....పైగా ఈ లాలస ఆయన ప్రియురాలయి ఉండవచ్చును. విశాఖపట్నంలో డాన్సాడే అయ్యగోరు ఇంకా అరగంటకి రైలుకింద తలపెడతాడనగా ఈలాలస కథే కాబోలు వినిపించి తన ప్రాణం తీశాడు కన్యశ్రీ.

"కన్యశ్రీగారు నా కథే వ్రాశారు. అందుచేత ఈ కథ అంటే నా కిష్టం. అందులో మీరు ధరించబోయేది నా పాత్రే" అంది లాలస నవ్వుతూ.

ఆ నవ్వు చూసి ఈమె సినిమాల్లో నటిస్తే విపుల నోట్లో మన్నే అనుకుంది ఆ పక్కనే కూర్చున్న సావిత్రి. కాని విపులకి భగవంతు డెప్పుడూ సహాయం చేస్తాడు. మాట్లాడే లాలసని చప్పున ఆపి, రేపు ఏ సంగతీ చెపుతానని పంపివేసింది.

ఆ రాత్రి చింతామణిని కూర్చోపెట్టి లాలసా కన్యశ్రీల కథ చెప్పి వ్రాయించింది విపుల.

మరునాడు అదే సమయంలో లాలసతో "నా దగ్గర ఒక కథ ఉంది. అది నా కథ....నా పాత్ర నేను నటించాలని చాలా రోజుల్నించి ఒక కోరిక. మా చింతామణి మహా రచయిత్రి. ఆమె కలంలోంచి వచ్చిన నా కథ నాకే అద్భుతంగా ఉంది....మీరోసారి వినండి.... బలవంతం ఏమీలేదు, ఊరికినే. తరువాత మీ రన్నట్లు కన్యశ్రీగారి గారి కథే విందాం. ఈలోగా కాస్త రిఫ్రెష్ అవుదాం. సెల్వరాజ్! చూడమ్మా. కాస్త ఆ ఫ్రిజిడేరు తీపి రాత్రి చెట్టియారుగారు పంపించిన సరుకు తీయి" అని ఆజ్ఞాపించింది విపుల.

నాలుగు నారింజరంగు గ్లాసుల్లో పోసి బల్లమీద పెట్టాడు సెల్వరాజ్— కళావాణీత్రయంతోపాటు లాలసకూడా చేరటం, ఈ ముండ లందరికీ తను సేవ చేయాల్సి వచ్చేట్లు విధి లిఖించటం వాడికి తగని మంటగా ఉంది.

"రాత్రి మీ పేరు నా కెంతో అందంగా వినిపించడంచేత మీ పేరే ఈ కథానాయికకి పెట్టమన్నాను....ఇహ చదువు చింతామణీ!" అంది విపుల.

"లా—ల—స....నా బ్రతుకు....నా ప్రాణం....నా జీవిత సర్వస్వం........" అని చింతామణి చదవటం ప్రారంభించగానే లాలస చాలా ఇబ్బందిగా కుర్చీలో కదిలింది. అది చూసిన ముగ్గురూ చాలా సంతోపించారు....

కథ పూర్తయ్యేసరికి అరగంట పట్టింది. ఈ అరగంట అయే సరికి లాలస నిషాతోపాటు లాలస కోపంకూడా శిఖరాలకి చేరింది. ఆమె కొన్ని క్షణాలు ఊరుకుని "ఈ కథ మీదా అన్నారు?....' అంది.

"అవును, అలాటి సంఘటనలే జరిగాయి."

"హీరో ఎవరు?" పళ్ళు నూరుతూ అడిగింది లాలస.

"ఎవరో భ్రష్టుడు....మా నాన్నగారు విశాఖపట్నంలో ఉండగా మా ఇంటికి ఓ కవి వచ్చేవాడు. అతను ఈమధ్య పాండీ బజారులో కనిపించాడు....నేను వినటం అతను ఆడపిల్లల్ని ఆకర్షించి అనుభవించి అవే కథలుగా వ్రాస్తాడని. బై ది బై-వాడి ఆకర్షణలో నేనూ పడ్డాననుకోండి. అదొక బేడ్ డ్రీమ్" అంది విపుల వొళ్ళు విరుచుకుంటూ.

ఆ మాటలు విన్న లాలస చాలాసేపు అలాగే కూర్చుని వెళ్ళి పోయింది. ఆ తరువాత విరగబడి నవ్వింది విపుల. కథ చింతామణి చేతే వ్రాయిస్తే ఇంత శ్రమ తనకుండేదికాదు. కాని చేసేదేదీలేదు. తన కథట తన కథ? ఇప్పుడీవిడ తన కథ సినిమాగా తీయకపోతే ప్రపంచం మునిగిపోతుంది కాబోలు....అనుకుని హాయిగా నిద్ర పోయింది విపుల.

కాని ప్రపంచం నిజంగానే మునిగిపోయింది. లాలస తనే హీరోయిన్‌గా నటిస్తూ రావుగారిని హీరోయిన్‌గా పెట్టి

కన్యశ్రీ కథనే సినిమాగా తీస్తున్నట్లు పేపర్లో వచ్చిన రోజున దాదాపు మతిపోయింది విపులకి. తనూ, సావిత్రీ ఎడ్వాన్సుగా తీసుకున్న డబ్బుకూడా వదులుకుందంటే లాలస చాలా గట్టిది అయి ఉండాలి....ఆ రోజంతా గది వదిలి బయటకి రాలేదు విపుల. కాల్ షీటు కాన్సిల్ చేసింది. ఆవిడ తలుపు కొట్టటానికికూడా ఎవరికీ ధైర్యం చాల్లేదు— మరునాడు మామూలుగానే బయటికి వచ్చి పనుల్లో పాల్గొంది ఆమె.

లాలస చాలా మంచిది. డొంకతిరుగుళ్ళతోనూ, పీట ముళ్ళతోనూ కూడిన ఈ కళాప్రపంచాన్ని ఆమె తన మంచితనంతోనే లోబర్చుకోవాలనుకుంది ...అందుకే ఆమె డైరెక్టరు సుబ్బారావుగారు చెప్పినట్లు విని కొత్తదానినని భయపడకుండా నటించటానికి ఒప్పుకుంది....రావుగారు హీరో అనగానే డిస్ట్రిబ్యూటర్లు ముందుకొచ్చారు....సావిత్రి పాట కూడా లాలసకి వెగటనిపించిందో ఏమిటో! బొంబేనుంచి ప్రఖ్యాత గాయనీమణిని పిలిపించి ప్లేబాక్ పెట్టించింది....దాంతో విపుల పూర్తిగా ఓడిపోయినా ననుకుంది.... కాని అదేమీ పైకి వ్యక్తపరచకుండా సమయంకోసం కాచుకునుండటమే శ్రేయస్కరం అనే విషయం అమెకు పూర్తిగా తెలుసు. అయితే అంతరాంతరాల్లో ఏదో మూల సావిత్రిమీదా, చింతామణిమీదా విసుగు కలిగింది. వీళ్ళిద్దరితోనూ తను ముడిపెట్టుకోకుండా ఉంటే తనకీ అవమానం కలగకపోను....ఆ విసుగునికూడా పైకి కనిపించనీయలేదు ఆమె.

ఆ సాయంత్రం అనుకోకుండా వాళ్ళిద్దరూ స్టుడియోలో కలుసుకున్నారు....మేకప్‌లో ఉన్న లాలసని చూసి ఆశ్చర్యపోయింది విపుల. ఒక అసూయేకాదు, ఆరాధనకూడా కలిగింది లాలస అంటే. ఎప్పటిలాగానే యేదీ పైకి చెప్పలేదామె....లాలసే ముందు పలకరించింది.

"హలో!....మీరు ఈ వేషం వేసుంటే నా కింత కష్టం ఉండేదికాదు....బావున్నారా?" అంది ముత్యాలు కురిపిస్తూ లాలస.

"మీరు కాంట్రాక్టు డబ్బుకూడా వొదులుకున్నారుగా....ఇప్పుడిలా అంటారేం?" అంది విపుల శాంతంగా.

"నాకు ఆ రోజు చాలా అయోమయం అనిపించిందండీ! బుర్ర పని చేయలేదు....మీ కథా,నా కథా ఒక మాదిరిగానే ఉన్నాయి. ....చాలా ఆశ్చర్యంగా లేదూ....అది మీకు ఆ రోజునే చెపుదామనుకునీ మీరు నమ్మరేమోనని ఊరుకున్నాను" అంది లాలస అద్దంలో చూసుకుంటూ.

"నాకు తెలుసు."కింద పెదవి పంటితో నొక్కుకుంటూ అంది విపుల.

"ఎలా తెలుసు?" ఆశ్చర్యంతో ప్రశ్నించింది లాలస.

తనెంత తెలివితక్కువగా మాట్లాడిందీ అర్థం చేసుకొన్న విపుల నవ్వుతూ "లోకంలో ఆడవాళ్ళ కథలన్నీ ఒకటేనండీ లాలసగారూ!" అన్నది.

# 17

లాలస మాత్రం తను గొప్పదాన్నైనట్లు భావించలేదు. ఈ కథ గొడవలోపడి సినిమాలో వేషం వేయటం ఆమెకి అధఃపతనంగానే ఉంది— ఈ సినిమా ఓ ప్రపంచం. ఇందులోనూ సంస్కారం సంస్కృతీ ఉన్నాయి— సాహిత్యంమీద ప్రేమ ఇక్కడ ఉన్నట్లు మరెక్కడా కనిపించదు— రాజకీయాల్ని గురించి ఇక్కడ తెలిసినట్లు ఇతర లోకంలో తెలియదు— ఇక్కడ విద్వాంసులుగా పరిగణింపబడేవాళ్ళకి అక్షరాలు రావు. కాంటీన్‌లో కాఫీ లందించే కుర్రాడు ఒకడు కవిత్వం అద్భుతంగా వ్రాయడం తను ఎరుగును. ఇందులోకి ఎలా వచ్చాను అని తనను తాను అనేకసార్లు ప్రశ్నించుకుంది లాలస. కన్యశ్రీ తనని గురించి కథ వ్రాసినట్లే ఎంతమంది

తోనో ఎంతో అసహ్యంగా చెప్పి ఉంటాడు. అందులో విపులకూడా ఒకత్తి అనే విషయం ఎంతో ఆలస్యంగా గ్రహించింది లాలస.

ఇదంతా ఎవరో చేస్తున్న ద్రోహంగా తోచింది. ఈ ద్రోహంలో ఎంతోమందికి భాగం ఉన్నట్లు తోచింది. కన్యశ్రీలాటి అధముడిమీద తను జాలిపడినందుకు అతను తననీ కూపంలోకి తోశాడు....కుక్కకి విశ్వాసం ఒక్కటే కాదు, కరిచే గుణం కూడా వుంది.

ఈ కవులు జీవితం పెట్టే ఏ పరీక్షలోనూ నెగ్గరు. అన్నిటి లోనూ వీళ్ళకి మార్కులు తక్కువే— పోనీ అవి అందరిలాగా కళల జోలికి రాకుండా ఊరుకోరు. వచ్చినవాళ్ళు నటులలాగా డబ్బు చేసుకోలేరు. చేసుకోలేకపోగా తమ అసమర్థతకి ఇతర్ల మీద అసూయ పెంచుకుంటూ, ఆత్మశక్తిమీదా సంస్కారరాహిత్యంగానూ కూడా బ్రతుకలేని స్థితికొచ్చి జీవితాన్ని, దాని సమస్యలనూ పరిష్కరించ లేక సంస్కారం ప్రకటిస్తూ బ్రతుకుతారు.

నటులూ, ఇతర సాంకేతికవర్గంవాళ్ళూ అలాకాదు. వాళ్ళకి బ్రతుకే సమస్యగాని కళ సమస్యకాదు. వాళ్ళవల్ల కళకి ఉపకారం జరగకపోతే పోవచ్చుగాని అపకారం మాత్రం జరగదు— కవుల విషయం అలాకాదు. వాళ్ళు జీవిత సమస్యల్ని ముఖాముఖి ఎదుర్కో లేక కళకి, రచనకీ ముడిపెడుతూ ఉంటారు. దానివల్ల కళలకి ఉప కారం లేదు. వాటి పతనానికి ఇతని సంస్కారం పూర్తిగా కారణం. మంచి అయినా, చెడు అయినా తన స్వంత సంస్కారాన్ని నమ్ము కోవటం, దానికోసం సర్వస్వాన్ని వ్యయపెట్టడం అనే మాటలు అంటారు, వ్రాస్తారుగానీ - ఆచరణలోమాత్రం పెట్టరు. అందులో ఇహ మానవత్వం, ఉత్తమ సాహిత్యం అనేవాటికి అసలు ఆస్కారం లేదుగదా!

కవిత్వంలో సంస్కారం పతనమయిపోయిన తరువాత

వాళ్ళందరూ పత్రికల్లోనూ, రేడియోల్లోనూ ఉద్యోగాలకి ఎగబడు తున్నారనీ—నృత్యం ప్రతివాళ్ళూ నేర్చుకుని ప్రజల ఆస్తిగా మార్చే సిన తరువాత అందులో కుప్పిగంతులు తప్ప మరేం లేదనీ—వ్యావహారిక భాషోద్యమం కృతక భాషావాదమని— వాళ్ళు వాపోతారు.

మీ విశ్వాసా లేమిటి? కళల్ని గురించి మీ నమ్మకాలేమిటి? అని అడుగుతే సమాధానం ఉండదు. ఇవ్వాల్టి విశ్వాసాలకు రేపు పునా దులు కూడా ఉండవు. పోనీ, ఈ కళలకి స్వస్తిచెప్పి జీవితాన్నే తీసు కుందామా అంటే అదీ లాభంలేదు. కళాకారులుగానో, కళాభి మానులుగానో ఇదివరకు ఉన్న కాస్తో కూస్తో కీర్తికూడా ఇప్పుడు ఇగిరిపోవటం తప్ప.

ఏ రోజుకయినా కళాకారులు తాత్వికంగా ఆలోచిస్తే సమా జంలో కలిగిన మార్పూ, తత్వం బోధపడి ఉండేది—కళలు ప్రజల చేతుల్లోకి పోతే మరేం ఫరవాలేదనే సంగతీ అర్థమయి ఉండును—అది తప్పని నమ్మినా దానికి దూరంగా ఉండలేని స్థితిలో ఉంది వాళ్ళ పరిస్థితి—ఈ మార్పు సహజమనీ, ఫ్యూడల్ యుగానికి ప్రతినిధిగా కళా సరస్వతిలేకపోవటమే వాంఛనీయమనితెలుసుకుని, అందులోంచేఉన్నత స్థానం ఆక్రమించాలనీ నటులయినా అనుకుంటున్నారుగాని కవులు అనుకోటంలేదు— కాని ఎవరికీ స్వాతంత్ర్యం లేకపోవడంవలన ప్రయోజనం లేదనేది వేరే సంగతి.

ఏదయితే కళకి పతనం అని భావిస్తున్నారో ఆ సినిమాయే ఈ కళాకారులకి మూలాధారం. కళాసృష్టి చేసే ప్రతిభ లేక—దాని పరిణామాన్ని సహజంగా అర్థం చేసుకొనే తెలివిలేక డబ్బుమాత్రం పుష్కలంగా ఉన్న ప్రౌఢ్యూసర్లే ఈ కళకి పోషకులవటం కళకి అన్యాయం అనేది వీళ్ళ మరో నమ్మకం— దానివల్ల తను పోషకుల మీద కృతజ్ఞతకూడా లోపించటం సినిమా చేసుకున్న పెద్ద దుర దృష్టాల్లో ఒకటి.

ఇదంతా అర్థం చేసుకున్న లాలస సినిమాని అసహ్యించుకోవటం మానేసి సినిమా మనుష్యుల్ని అసహ్యించుకోవటం ఆరంభించింది— సినిమాలోకంలో లాలస అందం, మంచితనం, తెలివితేటలూ ఎడారిలో ఒయాసిస్‌లాగా కనిపించటం ప్రారంభించినయ్.... జీతా లివ్వడానికి, దానికీ ఆమె వాయిదా పెట్టటం లేదు— డైలాగు చెప్పటానికి ఫిలిం తినటంలేదు. కాల్‌షీటు కాలం వ్యయం చేయటం లేదు— సినిమా పరిశ్రమని నీచంగా గాని, గొప్పగా గాని చూడటం లేదు. కళతో మెదపటంవలన కొంచం తళుక్కుమంటుంది, అంతే. అంతకన్నా మరేంలేదు.

లాలసలో ఇంకో గొప్పగుణం ఏమిటంటే- కన్యశ్రీ ఒకప్పుడు ఆమెని ప్రేమించి ఏడిచినా ఇప్పుడలాటి ప్రేమ గొడవలు లేవు....లేకపోవటంవలన చెడుపేరు రాకుండా ఉండటమేగాని....లోలోపల ఉన్న గౌరవం పోనూలేదు. దానివల్లనో మరేమిటోగానీ లాలసకి చాలా పెద్ద కంపెనీలు ఆఫర్ ఇచ్చినయ్— లాలస కాదనలేదు. దానికి తోడు ఆమె తీసిన సినిమా 'రక్త హృదయం' విపరీతంగా డబ్బు చేసుకుంది.

ఇహ సినిమా రంగంలోనే స్థిరపడదల్చుకుంది—డబ్బు తప్ప వెనుకెవరూ లేని లాలస. ఏది ఏమయినా ఏడాది తిరక్కముందే విపులకీ, ఆలాటి కొందరు తారలకీ విలువ తగ్గింది—విపులకి మరీను. జన్మతహ సంస్కారంలేని విపుల ఎంత సంస్కారాన్ని అభినయించినా అప్పుడప్పుడు చేపల పిల్లగా మారిపోతూవుంటుంది. కిందటి సంవత్సరం తొమ్మిది సినిమాల్లో పనిచేసిన విపుల కిప్పుడు రెండు సినిమాలు కూడా లేవు. దానికితోడు ఈ సావిత్రీ చింతామణులతో తను ముడిపెట్టుకుని కెరియర్ పాడుచేసుకుంది.

లాలస....వెనక డబ్బుంది కనక ఇల్లాలయిపోయింది. అది తన కెలా సాధ్యం? ఆమె కన్నీవున్నాయ్. తనకేమీలేవు....ఎందుకని?

అదంతే....నిరుడంతా తన వాకిలిముందు నిలిచిన కార్లన్నీ ఇప్పుడు తన వాకిలి ముందుగానే దూసుకుపోతున్నయ్. నిరుడు తన ముందు జోహుకుం చేసిన వాళ్ళందరూ ఇప్పుడు తొందర వున్నట్లు పారిపోతున్నారు. అవును-ఇక్కడంతే. తనిప్పుడు హీరోయినే.... కాని ఇహముందు?....విపులకి విపరీతంగా భయం వేసింది.

త్రివేణి అనే ఆ యింట్లో మరో గదిలో సావిత్రి తంబురా శ్రుతిచేస్తూ ఆలోచిస్తున్నది. విపులతోపాటు తనకీ డిమాండ్ తగ్గింది. మ్యూజిక్ డైరెక్టర్ల చుట్టూ ఎన్నిసార్లు తిరిగినా నీకేమమ్మా విమలా దేవి అండుండగా అని, తను వెనక్కు తిరగ్గానే నవ్వుకుంటారు. ప్రస్తుతం తినటానికి లోపం లేకపోయినా ముందు గతి ఏమిటో అర్థంకావటంలేదు—ప్రకాశరావుగారు ఇప్పించిన ఇంట్లో ఉండి తింటే ఉన్న డబ్బు కొద్ది రోజులు రావచ్చును. దానికి మిగతా వాళ్ళు ఒప్పుకుంటారో ఒప్పుకోరో? అదీకాక ఈ త్రివేణి అనే దిక్కుమా లిన కొంపలో తన డబ్బూ ఉంది. అదెలా వస్తుంది? ఇది అమ్మితే గాని రాదు. తను చూస్తూచూస్తూ పెద్ద చిక్కుల్లో పడిపోయింది— నిన్న మ్యూజిక్ డైరెక్టరు సత్యంగారి దగ్గరకెడితే "నువ్వు పదేపదే రానక్కరలేదమ్మా, అవకాశం ఉంటే నేనే కబురంపుతాను. చూడు తల్లీ, నువ్వేమీ అనుకోకుండా ఉంటే ఒకమాట, విపుల బలవంతం వల్ల నువ్వు లతామంగేస్కర్ అంతదానివని ఏ వెధవైనా అంటే నువ్వది నమ్మకు. నీ పాటకి ఆర్కెస్ట్రా అధికంగా పెట్టడానికి కారణం తెలుసా? నీ గొంతుక శ్రుతిలో కలపకపోవడమే. రవీంద్ర భారతిలో వందేమాతరం, జనగణ మన పాడీ, ఆ పిచ్చి పెద్ద మనిషి ప్రకాశ రావుగారు దయకల్గి ఇప్పించిన ఉద్యోగం చేసీ నువ్వో గొప్పగాయని వని అనుకుంటే అంతకంటే పొరపాటులేదు. ఈ సినిమా లోకంలో రికమెండేషను ఉన్నాగాని ప్రతిభ కూడా అవసరం....ప్రతిభ ఉన్నా రికమెండేషనూ అవసరం .. కనుక నీకు రికమెండేషనే ఉంది ప్రతిభ అనేది లేదు కనుక నీ కిలాటిస్థితి వస్తుందని నాకు తెలుసు—ఈ స్థితి విపులకి కోపం వచ్చినా వచ్చివుండేదనుకో....కాని ప్రస్తుతం ఆమెకీ

డిమాండ్ లేదు. అదంతే. ఇక్కడెవరికీ జీవితపు పునాదులు గట్టివి కాదు....నా మాట విని మరో ఉద్యోగం చూసుకో. ఏదో బ్రాహ్మణ్ణి చెవుతున్నాను'' అన్నాడాయన... ఆయన చెప్పే దాంట్లో ఏ ఒక్క ముక్కా అబద్ధంకాదు-అదివరకు ఎలా బ్రతికిందో ఇప్పుడూ అలాగే బ్రతుకుదామంటే ఆ గ్లామరూ చచ్చింది కాబోలు అదీ కనపడలేదు.... ఈ లాలస....పోనీ ఆమెనే ఆశ్రయిస్తే....

సావిత్రి ఆదరాబాదరా బయలుదేరింది. ఆమె వెళ్ళేసరికి లాలస రవీంద్రుని గీతాంజలి చదువుతోంది-ఈమెకి ఇంగ్లీషు కూడా వచ్చునా ఏమిటి?

''నమస్కారం.''

''నమస్కారం, కూర్చోండి....ఏమిటిలా వచ్చారు, విపులగారు బాగా ఉన్నారా?'' అంది లాలస పుస్తకంలో చదివిన పేజీ దగ్గర మడుస్తూ.

''బాగానే ఉన్నారు....నిజంగా మీ ఎదుట అనకూడదుగానీండి ఎక్కడ చూసినా మీ పేరేనండీ. అబ్బ పళ్ళు పులిసిపోతున్నాయండీ. తమ చదువూ సంస్కారం, తమ ప్రవర్తనా....''

''సంతోషం....కాఫీ త్రాగుతారా?'' అని బెల్ కొట్టింది లాలస.

''విపులగారికి ఈ సంస్కారం లేదండీ.........తమరు అలా కాదు.''

''మీ యిద్దరికీ చాలా స్నేహం అని వింటున్నాను.''

''ఆ....అదే స్నేహం. అప్పుడు ముగ్గురం సరిసమానంగా పెట్టుబడిపెట్టి ఆ ఇల్లు ఏర్పాటు చేసుకున్నాం....అదే స్నేహం....'' అంది తేలిగ్గా సావిత్రి

"ఆవిడ మంచి యాక్ట్రెస్ అండీ!"

"అదేలెండి, వృక్షంలేనిచోట ఆముదం చెట్టులాగా మీరు ఫీల్డు లోకి వచ్చేవరకూ ఆవిడే హీరోయిన్....కానిప్పుడు అలాకాదు."

"అంటే? నేనుగాని ఆమెకి అడ్డుపడ్డానా?"

"మీరలా అంటే చెప్పేదేంలేదు. ఇదివరకు ఆమె అంటే అభిమానించే ప్రొడ్యూసర్లు ఇప్పుడు తమరంటే అభిమానిస్తున్నారు. అంతేగాని మీరామెకి అడ్డుపడట మేమిటి?"

"సరే, తమరు వచ్చిన పని?" చాలా సుందరంగా అడిగింది లాలస.

"ఏమీలేదు. తమరి హృదయం చాలా గొప్పదని విని వచ్చాను. తమరు నన్ను మర్చిపోనని ఒక్కమాట యిస్తేచాలు, ఇహ నిశ్చింతగా నిద్రపోతాను."

"అదేమిటి?"

"ప్రస్తుతం నాకూ ఎక్కువ సాంగ్స్‌లేవు. తమ రొక్కసారి ప్రొడ్యూసర్లతో నన్ను గురించి ఒక్క మంచి మాట అన్నా రంటే........"

"నిజంగా నా కంత శక్తి ఉందా? అనుమానమే. అయినా మీ రడిగారు కనుక ఆలోచిద్దాం" అంది లాలస తిరిగి పుస్తకం తీస్తూ... ఈ వ్యవహారం ఇహ నీళ్ళు కారినట్లే....పైగా ఈ సంగతి విపులకి తెలిస్తే అదో రభస—ఎంత బ్రష్ కొట్టినా లొంగిరాలేదు ఈవిడ ఛీ ఛీ.... అనుకుంది సావిత్రి.

# 18

చింతామణికి మాత్రం నాలుగు సినిమాలున్నై....ఎందుకంటే రచయిత ఎవరైనా ఒకటే........వాళ్ళకి ప్రాధాన్యమూలేదు పాడూ లేదు కనుక....చింతామణికి విపులతోపాటు డిమాండ్ తగ్గలేదు, హెచ్చనూలేదన్నది వేరేసంగతి....లాలస హీరోయిన్‌గా ఉన్న ఒక సినిమాకి సంభాషణలు వ్రాస్తున్నది ఆమె,

ఆ రోజు ప్రొడ్యూసరుగారు మండిపోతున్నారు.

"ఇప్పటికే బోలెడు డబ్బు తగలబడి పోయింది. ఇంతమటుకు డైలాగులు పూర్తికాలేదు."

"అదికాదు సోమేశ్వర్రావుగారూ, మీ బొమ్మ రజతోత్సవం చేసుకుంటుంది. నాకు ఆలస్యంగా మూడ్ వచ్చిన సినిమాలన్నీ అంతే" అంది చింతామణి సెంటిమెంట్‌ని తవ్వి తీస్తూ........కాని సోమేశ్వర్రావు చల్లబడలేదు. అతను పూర్వాశ్రమంలో బొంబాయిలో ఐస్‌క్రీము అమ్మినవాడు. చదువూ సంధ్యా లేకపోయినా కాస్త ప్రపంచ జ్ఞానం ఉంది.

"సర్లెగండి....ఈ పూట మూజిక్‌డైరెక్టరు టైమిచ్చినాడు.... హార్మణీ తీసుకుని అయిదు నిముషాల్లో తగలడతాడు....ఆ పాట మూడ్‌లోకన్నారాండి...." అన్నాడు. ఆతని మాట పూర్తి కాక ముందే మ్యూజిక్ డైరెక్టరూ, అతని సైన్యమూ వచ్చారు.

"ఏమమ్మా నమస్కారం. ఈ పూట దేశభక్తినీ, లవ్‌నీ మిక్స్‌చేసి పాట వ్రాయాలి కదూ? రండి ట్యూనిస్తాను" అని

నోట్లో ఉన్న కారా కిళ్ళీ తుపుక్కున ఉమ్మేసి మండిపోతున్న ప్రొడ్యూసర్ని చల్లబడేశాడు—ఆపళంగా హార్మణీ చావబోతున్న కరిపి గేదెలాగా అరవటం ప్రారంభించింది.

"చూడండమ్మా, మీరు త్వరగా వ్రాయాలి. మళ్ళీ నాకు గంటన్నరకన్నా టైము లేదు. ఇదుగో ఇది మాల్కోస్‌నీ హిందోళనీ మిక్స్‌చేసి భూపాలరాగపు ఆర్కెష్ట్రాతో బాక్ గ్రౌండ్ మ్యూజిక్ ఇవ్వాలని ఉంది. ముఖ్యమైన ఇన్‌స్ట్రుమెంట్సన్నీ ఇందులో పెడుతున్నాను. కొంచెం బీటిల్స్ పద్ధతికూడా అనుసరిద్దామని ఉంది.... మాటలకి అవస్థపడకండి. ఏవొస్తే వాటినే గుచ్చేయండి" అని తన అమూల్యాభిప్రాయాన్ని చింతామణికి సరఫరా చేసి, పెద్ద పెట్టున ప్రొడ్యూసరు బుర్ర పనిచేయకుండా హార్మణీ వాయించ సాగాడు మ్యూజిక్ డైరెక్టరు. చింతామణి వాక్యాలు గుచ్చ సాగింది.

నన్ను చూడు....నా తీరును చూడు
టటట టాటా....టా టట టాటా....
గోవులకొండా బండలు చూడూ
డింగిరి డీడీ....డీడిరి డింగి
మూలను ఉన్నా....మోమును చూడూ
నీ ననానీ నన్నిని నీ నీ
నీలపు చీరా....పమిటెను చూడూ
లాలల లల్లీ....లల్లిలి లీ లీ

"మూలను ఉన్న మోమేమిటి?" అసిస్టెంటు డైరెక్టరు ఊరుకోలేక అడిగాడు.

"ఊరుకోవయ్యా! పెద్ద రైటరూ మూజిక్ డైరెక్టరూ వేసుతున్న పాటని విని ఊరుకోవాలిగాని ప్రశ్నలడగకూడదన్న జ్ఞానం లేకపోతే నువ్వు సినిమాలకి పనికిరావు. అసలీ హార్మణీ గోలలో

మాటలు-వినపడి చస్తాయా ఏమిటి?" విసుక్కున్నాడు డైరెక్టరు. ఆయన అప్పుడే వచ్చాడు. ప్రొడ్యూసరు మొగంవంక చూడకుండానే సరాసరి రంగంలోకి దిగాడు. అంటే—అసిస్టెంటు డైరెక్టర్ని చివాట్లు పెట్టటమే పనికి ప్రారంభం అన్నమాట.

"సరేగానీండి డింగిరి డీడీ డీడిరి డింగీ అంటే ఏమిటండీ?" అన్నాడు ప్రొడ్యూసరు సోమేశ్వర్రావు ఎవర్నడుగుతున్నాడో అర్థం కాకుండా.

"అక్కడ మాటలు వేసేకన్నా శబ్దాలు వేస్తే మ్యూజిక్ డైరెక్టరుకి తేలిక, అందుకనీ...." అన్నాడు డైరెక్టరు.

"పెద్ద రైటర్లు మాటలు అట్టే వాడరండి—హి....హీ...." అన్నాడుమ్యూజిక్ డైరెక్టరు చెమటని జేబు రుమాలుతో అద్దుకుంటూ.

"కాదండి మ్యూజిక్ డైరెక్టరుగారూ... మీ వాయిద్యాలకి అడ్డు రాకుండా ఉండాలన్నారు కదండీ. అందుకని" అన్నది చింతామణి—తప్పులన్నీ ఎదటి వాళ్ళవీ, ఒప్పులన్నీ తనవీ అనుకోకపోతే జీవ యాత్రే సాగదు—సినిమా జీవయాత్ర అసలే సాగదు.

"సర్లెండి—డైలాగులు వ్రాసుకోండి తమరెళ్ళి" అని చింతామణికి సూచించాడు సోమేశ్వరర్రావు. డైలాగులు వ్రాయటం అంత తేలికకాదు గాని చింతామణికి మాత్రం సినిమా డైలాగులు త్రిప్పి త్రిప్పి వ్రాయటం బాగా వచ్చును. ఒక సినిమాలో "మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు నాన్నా, నేను శేఖర్ని ప్రేమించానుగాని కామించలేదు. పవిత్ర ప్రేమకి ఏ లోకంలోనూ చావులేదు. మీరు మమ్మల్ని విడదీయలేరు" అనే సుదీర్ఘమైన డైలాగు కాలేజీ పిల్లలకీ ఆడవాళ్ళకీ నోరూరేలాగా వ్రాయగలదు. పూర్వం రైల్వే నవలలు ఆమె తెగచదివింది. అలాంటి సహస్రాధిక గ్రంథాలు విజయవాడలో ఒక లైబ్రరీ వారు పాత పుస్తకాల కింద అమ్ముతుంటే అదృష్ట

వశాత్తూ ఆవిడ చూడ్డం జరిగింది. అవి కొన్ని దగ్గరనుంచీ ఆవిడ సినిమా డైలాగులకి వెతుక్కోనవసరం లేకపోయింది.బాగా వ్రాస్తుం దని పేరూ వచ్చింది.

"ఛీ....దౌర్భాగ్యురాలా! నీవు నా కడుపున చెడబుట్టావు. దమ్మిడీ లేని ఆ వెధవని నువ్వు పెళ్ళాడితే నా ఆస్తిలో నీకు చిల్లి గవ్వ రాదు" ఇది సినిమాలో తండ్రిగారు అంటారు.

"నాన్నా....నన్నంటే అనండి గాని ఆయన్నేమీ అనకండి."

"అంటానా? మరీ అంటానా?"

"మీకు డబ్బుంది కనక అంటారు....పేదవారయినా గుణానికి తక్కువగాదు. అడుక్కుతిన్నా ఆదర్శంగా అనుబంధంతో ఆశతో అద్వితీయంగా అప్రతిహతంగా ఉంటారు" (ఇక్కడ అకార ప్రారంభం)

"అయితే వెళ్ళు."

"వెడతాను నాన్నా, వెడతాను. మళ్ళీ ఇహ మీ గుమ్మం ఎక్కను" అని అంత లావు హీరోయినూ వెళ్ళిపోతుంది. వెంటనే పాట.

ఈ విధంగా చింతామణి ఎన్ని డైలాగులయినా వ్రాయగలదు. అటు ప్రొడ్యూసర్లూ, ఇటు నటులూ సంతోషిస్తున్నారు. ఇలాటి డైలాగుల కోసం ఆమె వెతుక్కో నవసరం లేకుండా రైల్వే సాహిత్యం అని పేరెక్కిన నవలలు సహాయం చేస్తూనే ఉన్నాయి. జానపదాలైతే కాశీమజిలీలు, పన్నెండు రాజుల కథలు, నిజమైన కాశీ మజిలీలు....బాలనాగమ్మ కథ మొదలైన కథలూ, శుక సప్తతి—పూర్వం తెలుగు దేశంలోకి అదే పనిగా దిగుమతయిన రాజస్థాన కథా

వళీ ఆమెకు ఆధారం. స్క్రిన్ప్లే కూడా వాటిలో నుంచి తీసుకుంటుంది. సోషల్, జానపదం ఫరవాలేదు గాని పురాణ గాధలే ఆమెకు కొరుకుడు పడటం లేదు. అవి చదవటానికే ముందు ఆంధ్ర, సంస్కృత భాషలు అవసరం. అవి రావుగదా ఓ పట్టాన!

అందుకని చింతామణి పురాణాలు వ్రాయలేదు. ఎందుకు అభాసు పాలవాలి? పై చెప్పిన డైలాగులు సోమేశ్వరరావుగారికి ఇచ్చి ఆయన్ని చల్లబరిచి ఇంటికి వచ్చేసరికి విపుల తన మామతో రహస్య మంతనం చేస్తున్నది.

# 19

"నే నసలు ఈ కొంప కట్టడం పొరపాటయి పోనాది మామా!" అంది విపుల.

మామతో మాట్లాడుతున్నప్పుడు అప్పలుగా మారిపోయి మాట్లాడితేనే వాడికి అర్థం అవుతుంది....విశాఖపట్నం యాస లేక పోతే వాడికి బోధపడి చావదనేది ఆమెకి తెలుసు.

"ఈ చింతామణికి ఏరాడ కొండంత గోరోజనం. ఆ సావిత్తిరికి అరకు లోయంత ఏడుపు....దీని ఫలితం చూశావురా మామా, చివరకి ఇట్లాగయినాది . కొంచెం ఇనఫర్మేసను అట్రాండే ఆని తగిలేను....సావిత్తిరి పోయి లాలసతో కూడినాదంట ...చింతామణి పతివ్రతయి పోనాది. అదీ ఇదీ కుమ్మక్కు....దాని కడుపులో ఏ ఆలోశనుందో నేను కళ్ళు మూసుకుని కనిపెట్టేగల్ను—దిబ్బమొహం అదీను" అంది విపుల, మామవంక కోపంగా చూస్తూ.

"పోయే ఎర్రిగుంటా! నీ మొహంతో పిక్చర్ తీస్తే అంతా సూత్తారు...ఆడారి యదవలు ఈరోలూ, మొగంగి ముండలు ఈరోయిన్లూ....అయినా ఆ కొత్త ట్వారు-ఉన్నదొసే ...దానివంక సూత్తే ఏసంకాలంలో ముంజలూ కరువ్వాసినంత నంజలూ....నీళ్ళల్లో సూసిన చందమామా గావక మొస్తాది" అన్నాడు మామ చుట్ట అంటిస్తూ.

"నీలాటి ఎదవలంతా సైటంతా అప్పగించేసి తెల్లబోయి సత్తా ఉంటే అదలాగే కనిపిస్తాది నాకంటె అందానికి ఎక్కువా? స్టాటస్‌కి ఎక్కువా? తెలివికి ఎక్కువా?" అంది విపుల మరింత రెచ్చిపోతూ.

"నువ్వనాగ కోప్పడితే ఏటి సెప్పేది? అది సదూంకున్నదే."

"సదూంకున్నదా? పావలా పరక సదువూ, అణా పరక అందమూ ఉంటే సరిపోద్దా? అదేదో పెద్ద ఈరోయిన్లాగ మాట్టాడతావేటి? మొగ ఎదవలకి ఒక్కోడికో రుపి. పీనిగ ఎదవలు!"

"కాదే. నా జుత్తులో అనుబగాల్తో సగం రాలిపోనాయి.... మిగతా సగం పండిపోనాయి....మద్ది పల్లె కులమే పాపిట్టిదానా.... ఆడదాయి కేటి అందమో నాకు తెల్చు. ఆలిచిప్ప కళ్ళూ, సొరచాప వళ్ళూ, వల ఇసిరే నేర్పూ ఉన్న ఆడదాయిని ఆ బెమ్మగాడు కూడా గెలవలేడు. నీ సంగతేటి? నువ్వెయ్యేట్టుకునే గెల్చినావు....గెల్చినావా లేదా?" అన్నాడు మామ చుట్ట నుసి రాల్చుతూ.

"బిగ్గరగా అనమోకరా సచ్చినోడా....ఎవరన్నా వింటారు" అంది నోరు నొక్కుకుంటూ విపుల.

"కాదే. అలాటి ఆడదాయి తల్సుకున్నదంటే....అది నడుం తిప్పుకుంటూ నడసినాదంటే సచ్చిన పీనిక్కీ మొగతనం ఒస్తాది....

బ్రతికిన మొగోనికి స్పృహ తప్పి పోతాది....పినిమావోల్ల నందర్నీ ఉప్పుసేపల్లాగ అమ్ముకొస్తాది....చల్లే, నీకు కోపమొస్తాది....అల్లిద్దరూ ఏరి?"

"అదేగదూ ఇప్పుడు నా బాద ...దీనికి పేటకో మొగుడూ.... దానికి ఇంటికో బరతానూ....నా ఇంట్లో ఎవురైనా సరే ప్రొడ్యూసరు పెల్లమయినా సరే పైనాన్సరు పేయసైనా సరే నామాట ఇని తీరాల్పిందే....ఏమంటావు?"

"నా నేటంటానే ఎర్రిమొగమా....సెల్లెల్ని సంపి దాని మొగుడిని సెరిసిన బటాచోర్లే ఈడంతా" అన్నాడు దాని మామ ఓదారుస్తూ.

"నీ రంకు మొగుళ్ళంతా ఏరని అంటారని బయం వేస్తున్నాదే మామా, ఏటందామన్నా....ఇది ప్రకాశరావుగోరి ఇస్పేటు రాణీ-అది ప్రొడ్యూసరు గంగన్నగాడి ఆటీను రాణీ....చేపల్దాన్ని మునిగాడు పట్టినట్టు ఆ ప్రకాశరావుగోరికి ఇదెక్కడ దొరికినాదో? ఇదలాగుండగానే ఈ కొత్త ఈరోయిను గోలోటి? ఏ బుకింగులూ లేవు. ఏటి సేయాలో తెల్దు." విసుక్కుంది విపుల.

"నాలుగు పీకితే సచ్చేస్తారు....నీ దిబ్బ ప్రొడ్యూసరు ఏటయివాడు?"

"ఏటయినాడో తెల్దు ...ఆడూ సచ్చిపినాదేమో? హిందీ పిక్చరు తీస్తానన్న వోడు అసలు అవుపియ్యటం లేదు....అదొచ్చిపినట్టుంది.... డైలాగు వ్రాసి....దీని శార్దం డైలాగులు....ఏటీ రాదు....గొప్ప తప్ప....సరే, నీవు తొంగో....మందున్నదా? ఉంటే ఏసుకో, నా కూడా ఇత్తే అబ్యంతరం నేదు" అని మామ సీసాలో మిగిలిన మందు కొట్టేసి బయట కొచ్చింది విపుల.

చింతామణీ అదే పనిమీదుంది సావిట్లో—ఆమె ఎదురుగా ఉన్న బల్లమీద రెండు గ్లాసులూ సీసా మసాలా మాంసం ఉన్నాయి. సెక్రటరీ గణపతి ఆమె ఎదురుగ్గా కూర్చుని ఉన్నాడు—అతనిచ్చే ఉపన్యాసాన్ని అరమోడ్పు కన్నులతో వింటున్నది చింతామణి.

"చూడండి చింతామణిగారూ, మేడంకి తెలియటం లేదు గానీండి, కాలం ఒక మాదిరిగా ఉండదండి....ఎవరికి బలం ఉంటే అదిదే బ్రతుకు....విలేజికైనా టౌనుకైనా సిటీకైనా కాపిటల్‌కైనా లోకానికైనా స్వర్గానికయినా అదే రూలు....ఇంకో రూలంటూ లేదు. పెద్దచేప చిన్న చేపని మింగితే దాన్ని తిమింగలం ఫలహారం చేస్తుంది. ఒకడు డబ్బున్నవాడు, మరోడు ఆడికంటె డబ్బున్నవాడు, ఇంకోడు అంతకన్నా డబ్బున్నవాడు. దీనికి అంతులేదు. ఇంక మన లాటి వాళ్ళం ఎండకి మేచ్ అయే గొడుగు పట్టేస్తాం. ఎవత్తిదగ్గర పనిచేస్తుంటే దాన్ని బంగారు కొండగా భావిస్తూ దాని పాపాల్ని మర్చిపోయి ...దాన్ని రాణీని చేసి పొగిడేస్తాం. అది నమ్మితే దాని ఖర్మ. విపుల గారు పెద్ద స్టార్....చిత్రం చిత్రం....లాలసమ్మ హీరోయిన్....రైట్ రైట్....వారు చేసిన ఎదవ పన్లన్నీ గొప్పవి. అవునవును అంటాం మన సొమ్మేం పోయింది?" అన్నాడు గణపతి. మెట్ల మలుపులో నుంచుని విపుల వింటున్నదన్న విషయం వాళ్ళకి తెలియదు—గణపతి చెప్పిందాంట్లో ఆవగింజంతయినా అబద్ధం లేదని విపులకి తెలుసు. కాని వాడింత విశ్వాస ఘాతకుడని తెలి యదు—ఎంతో తెలివిగలవాడనీ, తనవరకూ మంచివాడేననీ ఆమె నమ్మటం పొరపాటు. వీడికీ ఈ చింతామణికీ ఇంత ఆత్మీయత ఎప్పు డొచ్చిందో అర్థం కావటం లేదు,

"గణపతీ! ఆ జయంత్ పిక్చర్స్‌వారి కాంట్రాక్టు మనకొచ్చే ఉపాయం చెప్పు" అంది చింతామణి.

"అవునమ్మా తల్లీ! ఆవిడకే దిక్కులేనప్పుడు సెక్రటరీగాడికి

నాకా పలుకుబడి? నువ్వు కథలేం వ్రాస్తావు తల్లీ, ఈమాత్రం తెలియక పోతే?" అన్నాడు గణపతి.

విపులకి చాలా కోపం వచ్చింది. ఇన్నాళ్ళనుంచీ వీళ్ళందర్నీ తను పోషించింది. కాని తనకేం మిగిలింది?....అయితే తనుమాత్రం వాళ్ళని ప్రతిఫలం లేకుండా పోషించిందా? ఇస్తే వాయినం పుచ్చుకుంటే వాయినం. కోపం అపుకుని తిరిగీ వినసాగింది ఆమె.

"నా ఖర్మ కాలి సినిమావాళ్ళకి నాచేత వ్రాయించాల్సిన బుద్ధి పుట్టిందిబో....నేనెలా వ్రాయవలె?" అంది చింతామణి.

"సరే, మీరూ కాదనలేదుగా....మిమ్మల్ని విపులగారు పట్టుకొచ్చిందంటారే అందరూను?" కాస్త పొగవేసి చూశాడు గణపతి. దానికి చింతామణి మాట్లాడలేదు కొంచెం సేపు. చివరకి—

"ఈ కథలు వ్రాయాలనే ఆరాటంతో మద్రాసులో రెండు నెలలు ఉన్నానొకసారి—గన్నారంలోంచి మద్రాసుకు మారిన నా జీవితం తెగిన గాలిపటంలాగా సెక్యూరిటీలోపించి ఆకాశహర్మ్యంలా అవుపించ సాగింది—బాగానే ఉంది గాని, నాకు మాత్రం ఆకర్షణ కలిగించలేదు. కారణం ఏమిటంటే-అంతకంటె ఆవారా బ్రతుకులు ఎరుగుదును నేను. పాము విషంతో నిషా పొందే మహానుభావుడికి విస్కీ నీళ్ళు వృధా గదా!"

"అవును."

"ఈ సినిమా ప్రపంచంలో కనిపించే రంగులూ, తళుకులూ, కాఫీ త్రాగడాలూ—స్త్రీ పురుషుల స్వేచ్ఛ. కాలేజీ పిల్లల కలల్లో నటీ నటులూ—ఎంత ఊహించుకున్నా గాని తన్మయం కలగలేదు సరిగదా సరదాకూడా లేకుండా పోయింది. ఇంతలో జేమ్సుబాండ్ కథ నొదాన్ని నా మొహాన పారేసి వ్రాయమన్నారు. జేమ్సుబాండ్ కథ అనేసరికి

గుభికీ దభికీ చావదన్నుకోవడం, అవయవాలు బిగదన్నుకుని నృత్యం చేయటం, సెక్సు చూపించి చక్కిలిగిలి పెట్టటం తప్ప మరేం లేదని నీరసపడ్డాను....సరే, ఏమయినా వ్రాసి తీరాలి గదా. వ్రాయకపోతే తిండి లేదు గదా! అందుకని ఒప్పుకున్నాను. ఆ ప్రొడ్యూసరుగారు చక్కా వచ్చి 'చూడండి, మాటల్లో కూడా సెంటిమెంట్ ఉండాలి' అన్నాడు. ఈ సెంటిమెంటుకి సరి అయిన నిర్వచనం ఏమిటో నాకింతవరకు అర్థం కాలేదు, గణపతీ! అలా అంటే నా అజ్ఞానం బయటపడుతుందేమోనని మెదలకుండా ఊరుకుంటున్నాను....అయన పార్ట్నరు మరో ప్రొడ్యూసరు అన్నాడు కదా—థ్రిల్ చెడకూడదు, వింటుంటే నిద్ర రావాలి అన్నాడు. అయితే చక్కిలిగిలి పెట్టి జోల పాడనా అన్నాను. కొంచెం మొగం ముడుచుకున్నా గాని మరేం కాలేదు. రైల్వే నవలల్లో ముద్దులు—గుద్దులు, హద్దులు- పద్దులు అనే నవలల్ని జ్ఞాపకం తెచ్చుకుని వ్రాసేశాను.

"చిత్రం ఏమిటంటే ఈ విధంగా వ్రాసిన మాటలు బాగున్నాయని ఇద్దరూ పొంగిపోయారు. ఇంత గొప్పగా ఎవరూ వ్రాయలేదని మెచ్చుకున్నారు....కాబోలనుకున్నాను....ఎందుకంటే అంత హాయిగా శ్రమ లేకుండా స్వల్ప వ్యవధిలో పూర్తిచేశాను ఆ సంభాషణల్ని.... అది పనిగానూ శ్రమగానూ కూడా తోచలేదు నాకు.

"కథ వ్రాయాలంటే ఎంత శ్రమపడాలో అందులో అరవయ్యోవంతు శ్రమ కూడా అనిపించలేదు నాకు. అలాటిది ఆ రచన....ఒక రోజున తోచక మరో ఫ్లోరులోకి వెడితే అక్కడ ఒక కన్నడం సినిమా జరుగుతువ్నది. చిత్రం కదూ జీవితం? దాని డైరెక్టరు గన్నారంలో సోడాబుడ్డి సోమన్న....వాడిందుకోసం నానా అవస్థలూ పడటం చిన్నప్పటినుంచీ తెలుసు నాకు....కాని ఏకంగా డైరెక్టరవటం.... అందులో కన్నడం పిక్చరుకి....కొంచెం ఆశ్చర్యంగా ఉన్నా గాని వాడు నాకు దండంపెట్టినప్పుడు....దీనికోసం రక్తాశ్రువులు చిందిం

చిన వాడి కళ్ళల్లో జీవిత ధ్యేయం నెరవేరిన తృప్తి కనిపించి ఆనందమే అనిపించింది....తిండిలేని అతని కడుపు నిండటం బాగానే ఉంది....కాని ఇది శాశ్వతమా? సోమయ్య డైరెక్టరుగా నిలుస్తాడా? ఎవరు చెప్పగలరు? ఇంకో ఏమిటంటే-కథ కూడా వాడిదేట! ఏదైనా సంభవమే. సినిమాలో అన్నిటికన్న తేలికైన పని కథ వ్రాయటం. అది సామాన్యంగా ప్రొడ్యూసర్లే వ్రాస్తారు.... ఏ కథా ఏ పత్రికా అచ్చు వెయ్యకపోతే దాన్ని సినిమాగా తీయచ్చుననే రచయితలు అక్కడ ఉన్నారు....అడ రచయితల కథల మీద ఆంధ్రదేశంలోనే కాదు-ప్రపంచమంతా మోజుగానే ఉందిప్పుడు....సోమన్న తన రెండో సినిమాకి నన్ను కథ వ్రాయమన్నాడు. అది రెండో ఛాన్సు.

"మరో ప్రొడ్యూసరుగారు పూర్వాశ్రమంలో కొబ్బరిపీచూ విస్తళ్ళూ అమ్మి ప్రస్తుతం సినిమా తీసి కళా సేవ చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు—గ్లాస్కో లాల్చీ, సెక్సప్పీలు కోసం పల్చని పంచా—నోట్లో ఖరీదయిన సిగరెట్టూ—నల్లని మొగం మీద పాత గోడకి పూత పెట్టినట్లు అరిచేతి మందాన పౌడరూ—ముక్కులు బద్ద లయ్యే సెంటు వాసనతో ఆయన్ని చూడగానే ఉత్సాహం సగం చచ్చేది—అసలే నా దగ్గరికి అట్టేరాని సరస్వతీదేవి పుంజాలు తెంపు కుని పారిపోయేది. 'సూడండి, ఈరోయిను గదిలో పడుకుని డ్రీము కంటది. ఇంతలో ఈరో లగెత్తుకొచ్చి గోడ దూకి దాని గదిలో దూరతాడు. ఆ తరువాత ఇద్దరూ తోటలో లగెత్తుతా డ్యూయట్లు పాడుకుంటూ దొర్లుతారు....అప్పుడేటవుతదంటే ఆ యమ్మకి గరబం నిలుస్తాది....సయి తల్లీ తండ్రీ ఇంట్లోంచి ఈడుత్తారు. పాడుకుంటా అడివిలో పోతావుంటే వానొస్తది.దుఃఖంసాంగు.ఇన్న ముసిలోడొకడు వోరు తల్లీ నువ్వూ? అనుకుంటా మంచితనంతో తన గుడిసెలో ఆశ్రయం ఇత్తాడు, అక్కడే బిడ్డను కంటది....బిడ్డను కంటం సూపిచ్చ నవసరం లేదు....తరువాత ఓ కంపెనీలో టైపిస్టుగా కుదురు

కుని పమిట నిండుగా కప్పుకొని పతివ్రతలాగా ఉంటే మేనేజరు ప్రేమిస్తాడు....చూడండి, ఆ కంపెనీ కొబ్బరి పీచు కంపెనీ అయితే పబ్లిసిటీ మనకి... ఏమంటారు? సర్లెగండి. ఆ తరువాత పిల్లోడిని మువిలాడే పెంచి ఇద్దరికీ పెళ్ళి చేస్తాడు. ఈ పిల్లాడు పదేళ్ళ ఎద వయ్యాక ఆడికి అమ్మా నాన్నా ఎవరనే ప్రశ్న ఒస్తుంది....ఈ కథని మీరు పెంచండి. మాంచి సెంటిమెంటుండాలి' అని చెప్పి మెలికలు తిరగటం మొదలెట్టాడు. దానికి కారణం ఏమిటా అని వెనక్కి తిరిగి చూస్తే ఆడది ఒకత్తి అటు వెడుతోంది.

"ఆ మేనేజరుది విశాల హృదయం కదూ! క్షమించి పిల్లవాడిని తీసుకు రమ్మంటాడు. కథ సుఖాంతం' అన్నాను. సరిగ్గా నామాట వినిపించుకోని ఆ పెద్దమనిషి అద్భుతంగా ఉంటుందని ఒప్పేసుకోవటంతో నాకు విస్తళ్ళూ కొబ్బరి పీచూ జ్ఞాపకం వస్తుంటే అందుకని అన్నాను.

"ఈ కథ ఉంది చూశారూ...."

ఇంకా నా మాట పూర్తి కాకుండానే—

"ఏటండీ, తిరపతిలో అభిసేకం సేయిత్తే అన్నీ వంద రోజులాడుతాయి .. కిటుకది గానీండీ కద కానే కాదు. 'ధూల్ కా ఫూల్' సూశారా? ఆ కద ఏటంటారు? ఇదే....సీతాలక్ష్మిచేత పావడా పైగ్గట్టించి డాన్సు సేయిత్తే సాలు....ఈరో విలన్‌ల పైటింగూ, పాటలూ-బస్....కదెవడిక్కావాలి?" అన్నాడు.

"నేనూ ఒప్పేసుకున్నాను. మరేం చెయ్యను? కాస్త కాలు నిలుదొక్కుకోవద్దూ? అపైన ప్రొడ్యూసర్ని కాదనటం సినిమాల్లో బ్రతకదల్చిన వాళ్ళ లక్షణం కాదు. ఆ తరువాత నేనూ, విపులా, సావిత్రీ ఒక సందర్భంలో తటస్థపడ్డాం."

"ఎప్పుడు?"

"అది తరువాత చెపుతాను. నేనయినా పెద్ద రచయిత్రిని కానుగదా! అందుకని డబ్బుకోసం రకరకాల పాట్లు పడ్డాను."

"అంతేగాని, విపులగారి సహాయం ఏమీ లేదన్నమాట!" అన్నాడు గణపతి. చింతామణి ఏమీ మాట్లాడ లేదు. ఆమె సమాధానం కోసం గణపతితోపాటు విపుల కూడా ఎదురు చూసింది.

చింతామణి తెలివి తక్కువది కాదు. ఏమీ లాభించనిచోట అభిప్రాయాలు చెప్పటం తెలివి తక్కువ. అందుకే ఏకాగ్రతతో త్రాగటం ప్రారంభించింది.

# 20

ఎయిర్ కండిషన్ ఆపుచేసి ఫాను వేసింది దాసీది. ఆ ఇద్దరూ మంచం మీద పడుకుని ఉన్నారు.

విపుల వక్షస్థలం మీద ఛాలియా చెయ్యి కదులుతున్నది. అతని కళ్ళల్లో మత్తు ఇంకా వదల్లేదు. విపుల జుట్టు చిందరవందరగా ఉండి చిరాకనిపించింది. ఆమె మెడ కింద అతని వాచీ తాలూకు సన్నటి శబ్దం. పట్టు దుప్పటి ఉండగా కాళ్ళవేపున పడి ఉంది. పరుపు మీద నుంచి దాన్ని కిందకి తోద్దామంటే ఛాలియాకి మెలకువ వస్తుందని జంకింది. తన రొమ్ములమీద ఉన్న అతని చేతిని తీపి అవతల పెట్టాలనుకుంది....కాని అతనితో తనకి పని ఉండటం వలన అలా చెయ్యలేదు సరిగదా, మెత్తగా మృదువుగా అతని చేతిని నిమిరింది కూడా.... ఆమె మోచేయి ఛాలియా మెడకింద ఉంది. అది ఇష్టంలేక తీసేసింది. గదిలో వేడీ, ఏదో వాసనా వ్యాపిస్తున్నాయి.

"ఛాలియా, నిద్రపోయావా?" అంది అసహ్యాన్ని అణచుకుంటూ విపుల.

"అవును." బిగ్గరగా ఆవులించి సమాధానం చెప్పాడు, తను లేవకుండానే దుప్పటి కప్పుకుంటూ.

"ఇహ లేద్దాం." లేచి కూర్చుంటూ అన్నది విపుల. తన స్త్రీత్వం పాతివ్రత్యం కోసం ఆమె అలమటించటం లేదు గాని విశాఖ పట్నంలో స్టూడెంట్లచేత అవమానింపబడినప్పుడు కూడా ఇంత బాధ పడలేదు తను.

తార....అనే మాటని గురించి విమల అనే మాటలు గుర్తుకి వచ్చినయ్.

"ప్రేమా అభిమానం ఆత్మగౌరవం అనే మాటలు ఉత్త చెత్త. ఇందులో ఆకలి అనే మాట ఒకటే నిజం" అవి....కావి తనకి ఆకలి వేసే ఇలాటి పనులు చేస్తోందా? కాదు. ఏదో తపనవల్ల ఇలా చేస్తోంది—మసిలే ఆలోచనల్ని అవతలకి నెట్టి హోటలు గది కిటికీలోంచి కనపడుతున్న బొంబాయి నగరాన్ని సముద్రాన్ని చూడటం ప్రారంభించింది ఆమె. విమల చెప్పిన ప్రకారం బొంబాయిలో హిందీ సినిమాల్లో వేషాలకి ప్రయత్నిద్దాం అని వచ్చింది. అదివరకు పరిచయం ఉన్న ప్రొడ్యూసరు ఛాలియామీద అద్భుతమైన ప్రేమ నటిస్తున్నది అందుకేననే విషయం ఆమెకీ, ఉండేడిస్తే భగవంతుడికీ తప్ప మరెవరికీ తెలియదు.

విపుల ఇదివరకు బొంబాయి మహానగరాన్ని చూడలేదు. విశాఖపట్నం, విజయవాడ, హైద్రాబాద్, మద్రాసు కేంద్రావపరకే మీటర్లులేని ఆవిడ ప్రసారాలు పరిమితం. ఇప్పుడీ మహానగరాల రాణి బొంబాయిలో ఉంటే భారతదేశంలో ఉన్నామని ఏ కోశానా అనిపించదు—కిటికీలోంచి కనిపిస్తున్న రోడ్లు ఒలికిన తారులాగున్నాయి.... మద్రాసులో సముద్రంలాగా ఇక్కడ సముద్రం హడావిడిగా లేదు. ఇక్కడ ఆడవాళ్ళు ఎంత లావుగా ఉన్నా బరువుగా మాత్రం లేరు.... తేలిగ్గా చకచకా నడుస్తున్నారు....'సిగ్గూ ఎగ్గూ లేకుండా ఒళ్ళమ్ముకుని బతికినదాన్నే కాని....గుడ్డలు మాత్రం ఈ మాదిరిగా కట్టుకోవటం నావల్ల కాదు....'అనుకుంది ఆమె. ఆడవాళ్ళు గుడ్డలు కట్టుకోక పోయినా పెద్ద ఫరవా ఉన్నట్లు తోచటం లేదు....సినిమా సెట్లలో కనిపించే ప్లాస్టిక్ పూలలాటి పూలు అప్పుడే కోసుకొచ్చారు కాబోలు చాలా అందంగా ఉన్నాయి.

అన్ని రకాల పళ్ళు ముక్కలుకోసి ఉప్పుజల్లి అమ్ముతున్నాడు ఒకడు. ఈ కాసేపట్లోనే వాడు ఏ పాతిక రూపాయలో అమ్మి ఉంటాడు. పెద్దవాళ్ళే కారుదిగి ఆ పళ్ళముక్కలు తినిపోతున్నారు. ఎందుకో ఆనందం అనిపించింది ఆమెకి. ఛాలియాని విద్రలేపి "పిని మాల సంగతి తరువాత. ముందీ మహానగరాన్ని చూద్దాం పద.... ఇక్కడి ఆడవాళ్ళు మరీ తమాషాగా వున్నారు" అన్నది.

బొంబే నగరంలో స్త్రీ........ఇతర మహానగరాల్లో స్త్రీకి విభిన్నంగా ఉంటుంది. ఇతర నగరాల్లాగా దానికి జాతీయత లేదు. సంప్రదాయంలేదు. అందుకని అక్కడ వున్న ఆడదానికీ అంతే. ఇష్టమే తప్ప నిర్బంధంలేదు. అర్ధనగ్నంగా తిరిగితే అక్కడ ఏ బాధాలేదు. పూర్తిగా ఎనిమిది గజాల చీర కట్టుకుని ముసుగేసుకున్నా గాని ఎవరూ నవ్వరు....ఎవరి గోల వారిది. ఎవరి సుఖాలు వారివి. ఎవరిష్టం వారిది.

ఆ నగరం ఒక రంగు రంగుల చిత్రం. ఆ నాగరికత ఒక పునాదిలేని మహాభవనం....పిచ్చి తీగల్లా అల్లుకొన్న గజిబిజి శబ్దాల కూడిక, వ్యాపార రహస్యాలకి కూడలి అయిన అడవి ఆ నగరం.

ఆనంద కౌముదీ సహిత సుందర నిశీధం... ఆశా నిరాశల మధుర శిశిరం....అంతా ధనం....అంతా ఆకలి....సరిగ్గా చెప్పాలంటే అదో సెప్టెర్....అదో కార్ లేస్ భూతం (కల్పన) దాని పాదాల వెంట ప్రతివారూ జారిపోక తప్పదు. వందరూపాయల నోట్లతో పేకాడతారు....అంచే ఆ నోట్లమీద పేక ముక్కలు అంటించి ఆడతారు. ఆ విషయం విన్న విపుల విభ్రాంతపోయింది. గేట్ వే ఆఫ్ ఇండియాకి ఎదురుగా ఉన్న తాజ్ మహలు హోటల్లో కాఫీ త్రాగితే వందరూపాయ లవుతాయని విని భయపడింది.

రోడ్డు కిటూ అటూ పదహారంతస్తుల మేడలపైన ఒకదానొకటి కలుపుతూ ఆకాశమార్గంలో కట్టిన వంతెనని చూచి ఆశ్చర్యపోయింది. అక్కడ రోడ్లు అక్కడ భవనాలు మనుషులు ధనం దారిద్ర్యం కేరింతల వెనకాల ఏడుపాపుకుంటున్న వెక్కిలి.

ఐస్‌క్రీం తింటూ చేదు ననుభవిస్తున్న జీవాలు ఊరికి దూరంగా నగర లక్ష్మికి పట్టిన చెదలు ఫాక్టరీ గొట్టాల నల్లజీబురు ఎలక్ట్రిసిటీ దీపాల తెల్లదనం నిగనిగల ప్రణయాలు....గుసగుసల ఆ కళ్ళు....అధ్వానం....చతుర్మధ్యం.

"రామరామ" అనుకుంది విపుల. ఖాలియా ఇల్లు ఆరు అంతస్తుల మేడ. అద్దెలే బోలెడు వస్తాయి.

"స్టూడియో కెడదాం" అన్నాడతను. కారు నడిచీ నడిచీ చివరకెట్లాగయితేనేం ఒక స్టూడియో చేరుకుంది. ఇందాకటి నుంచీ ఆశ్చర్యపోతున్న విపుల ఇది చూసి మరీ ఆశ్చర్యపోయింది.

ఆ స్టూడియోకన్నా తన తోటా దానిలో ఇల్లూ అందంగా వుంటుంది అనుకుంది ఆమె.

ఇటువంటి స్టూడియోల్లోంచి అంత మంచి సినిమాలు ఎలా వస్తున్నాయో ఆమెకి సరిగా తెలియలేదు. చివరికి 'వికృతంగా వుండే తల్లికి అందంగా వుండే పిల్ల పుట్టటంలేదూ? అలాగే కాబోలు' అని సరిపుచ్చుకుంది.

స్టూడియోకీ నగరానికీ ఉన్న దారిలో—చలి—వ్యాధి—మురికి—దరిద్రం. నగర లక్ష్మికి అంటిన కుష్టురోగంలా ఉన్న రేకు గుడిసెలూ—మిల్లుల్లో పనిచేసి పొగచూరిన జనం....వానలో నడుస్తున్న పసిపిల్లలూ-మురికి దుప్పట్లలో దూరే ఆడవాళ్ళూ...ముసలాళ్ళ మొహాలతో పసిపిల్లలూ సర్వసాధారణంగా కనిపిస్తారక్కడ.

ప్రతి కాలి సవ్వడిలోనూ ప్రతి కంటి మెరమెరలోనూ ఆకలి అని స్పష్టంగా వ్రాసి ఉంది. అంతా ఆకలి....ఆకలి బాధ తాలూకు కేకలు—ఆకలి చారికల అలుగ్గుడ్డలు....అంతటా ఆకలి ముద్ర.... వంటిళ్ళల్లో హోటళ్ళో ఆడవాళ్ళ కళ్ళల్లో కనిపించే ఆకలికి విభిన్నమైన మరో ఆకలి...కాలుతున్న చేపలోనూ,కాలుతున్న కడుపులోనూ ఒకే కుతకుత.

అంతే....అందరూ అందర్నీ అనుమానించే ఆకలి ఆ రేకుగుడి

సెల నిండా కాపురేసింది—విపులకి ఆకలి ఎలావుంటుందో తెలియని విషయంకాదు. ఆకలి కోసం, ఆకలి తీర్చుకోవటంకోసం తను ఎలాటి పనులు చేసిందో ఆమె మర్చిపోలేదు. జాలిగా చూసింది ఆ రేకు గుడి సెలవంక....ఆ దిక్కులేని కుక్కల మురికి విశ్వాసాలు అక్కడి వాతావరణాన్ని కలుషితం చేస్తున్నయ్....మృగస్వభావం అక్కడింకా నిండి ఉంది. బాధను ఓర్చుకోడానికి కంటితో కింది పెదవిని నొక్కి పెట్టిన బజారు స్త్రీ పమిటకొంగు గాలికి ఎగురుతూ చిరిగిన గాలి పటాన్ని గుర్తుకు తెస్తుంది.

నిట్టూర్చింది విపుల.

"ఏమిటి డార్లింగ్, అలా ఉన్నావు?" అన్నాడు ఛాలియా సిగ రెట్టు వెలిగిస్తూ. అవును, తను సమాధానం చెప్పాలి. నవ్వుతూ నవ్విస్తూ ఈ పక్షిగాడు తన సర్వస్వం అనిపించేలా చెప్పాలి. తన భవిష్యత్తంతా వీడి సిగరెట్ కొనలో ఉందని తల్చుకునేసరికి, తన మీద తనకే అసహ్యం వేసింది.

"ఏమిటి మాట్లాడవు?" మళ్ళీ రెట్టించాడు ఛాలియా.

విపుల తీయగా నవ్వుతూ సన్నగా సమాధానం చెప్పింది. "నిన్ను గురించే ఆలోచిస్తున్నాను, ఛాలియా! నీ వంటి అందమైన వాడూ, సమర్థుడూ నా కిదివరకే దొరికుంటే బ్రతుకు బాగుండేది గదా అని."

"ఇప్పుడు మాత్రం ఏం పోయింది?" అన్నాడు అతను సంతో షాన్ని నటిస్తూ.

"ఏమీపోలేదులే....కళ్ళు మూసుకుంటే కల కరిగిపోతుందేమో గాని ప్రస్తుతానికి ఫరవాలేదు" అంది విపుల. అది అబద్ధమని ఆమెకూ తెలుసు, అతనికీ తెలుసు. ఛాలియా నటించిన సంతోషాన్ని చూసి ఒక్క నిముషం నిజంగానే నేమో అని భ్రమించింది.

అతనికీ ఆమెతో పనుంది. విపుల ఏ గొప్ప సినిమా తారకీ

తీసిపోదు. డబ్బు తక్కువ తీసుకుంటుంది. పిక్చర్ మొత్తం అవుట్ డోర్‌లో తీసిపారేసి లాభం పొందుదామనే ఉద్దేశ్యంలో వున్నాడతను. ఇతని ద్వారా బొంబాయిలో కాలూని లోకాన్ని జయించాలనే ఉద్దేశ్యంలో ఉంది ఆమె. ఈ పోటీ ఆటలో ఇద్దరూ నటిస్తున్నారు.

దీనితో పోల్చి చూసుకుంటే సినిమాల్లో నటిస్తున్నది నటనే కాదు—అసలు బ్రతుకుకన్న పెద్ద నటనలేదు అనేది విమల. తను విమల తరానికీ లాలస తరానికీ మధ్య ఇరుక్కుని ఉంది. విమలా లాలసా తల్లీ కూతుళ్ళ వేషాలేస్తారు. మధ్యగా ఉన్న తను యే వేషానికీ పనికిరాదు.

సన్నగా నిట్టూర్చింది విపుల.

"చూడు డార్లింగ్....ఇప్పుడు తీయబోయే కథలో హీరోయిన్‌గా వేస్తామని టాప్ స్టార్సంతా తిరుగుతున్నారు....కావాలంటే వాళ్ళే ఫైనాన్సు చేస్తామన్నారు....నీమీద ఉండే అభిమానం కొద్దీ వాళ్ళతో కమిట్ కాలేదు నేను...." అన్నాడతను. అతను ఏవేపుగా లాగుతున్నదీ ఆమెకి అర్థం అయింది—కాని చేసేదేముంది?

"కిందటి పిక్చర్‌లో డిస్ట్రిబ్యూషన్ గొడవలలో దెబ్బ తిన్నాను—ఈ తడవ వాళ్ళమీద ఆధారపడదల్చుకోలేదు. హీరోకి సిటీ రైట్సు యిస్తాను. ఫైనాన్సు చేయమంటే ఒప్పుకున్నాడు.... నువ్వు ఫైనాన్స్ చేయనక్కరలేదు....పిక్చర్ అయేదాకా డబ్బు అడగకుండా ఉంటే అదే పదివేలు" అన్నాడు కారులోంచి బయటకు చూస్తూ ఛాలియా.

విపుల చాలా సంతోషించింది....ఒకవేళ అతను ఫైనాన్సు చేయమన్నా తను చేయక తీరదు. అలాటి పరిస్థితిలో గుడ్డిలో మెల్లగా ఈ చిన్న షరతు పెట్టాడంటే తను అదృష్టవంతురాలే అన్నమాట....కాని, వెంటనే ఒప్పుకోలేదు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"ఏమీలేదు....డబ్బు సంగతి ఎలా ఉన్నా....ఇప్పుడు ఉన్న తొమ్మిది పిక్చర్లూ ఏం చేయనా అని ఆలోస్తున్నాను." డిమాండ్ పెంచుకోవటంకోసం అద్భుతమైన అబద్ధం ఆడేసింది విపుల.

"అవుననుకో. ఇది హిందీ పిక్చరు. పది సినిమాలు తెచ్చి పెట్టలేని కీర్తి ఈ ఒక్క సినిమా తెచ్చిపెడుతుంది. సౌత్‌లో కూడా సమానంగా రిలీజ్ చేద్దామనుకొంటున్నాను. హరినారాయణ సేట్‌కి రికమెండ్ చేయి." చిలుక చెప్పే పలుకులన్నీ అబద్ధాలని తెలిసీకూడా అన్నాడు అతను.

ఆమెకి సౌత్‌లో పిక్చర్లు లేవని అంటాడు. అందువలన అతనికి లాభమేమిటి?

ఏమీలేదు.

అతను మెల్లి మెల్లిగా తనని ముగ్గులోకి దింపుతున్న విషయం తనకి తెలుస్తూనే ఉంది— కాని చేసేదేముంది? ఇప్పుడు తిరిగి హైద్రాబాద్ చేరినా ఎవరూ పట్టించుకోరు. చివరకి విశాఖపట్నం చేరాల్సి వస్తే....

ఆ ఊహ వచ్చేసరికే భయం వేసింది ఆమెకి....అలాకాదు. ఈ ప్రపంచాన్ని జయించాలి....జయించి తీరాలి. పళ్ళు బిగపట్టి కచ్చగా అనుకుంది.

"అలాగే డియర్, నీమాట కాదంటానా?" అంది ప్రేమగా ఛాలియా చెంపలు నిమురుతూ.

మహానగరం విరగబడి నవ్వుతూ ఆనందబాష్పాల్ని సముద్రంలో విదిలిస్తున్నది. అంతటా నటన! అద్భుతమైన నటన!! నటరాజ్ హోటలుముందు కారాగింది.

## 21

బొంబాయి నగరంలో ఒకచోట ఈస్టిండియా కంపెనీకి ముందు కట్టిన ఒక పాత భవనం ఉంది....దాని ముఖాన

వేళ్ళాడుతున్న బోర్డుమీద 'శ్రీపత్ లాల్ అండ్ సన్స్...దళారీ వ్యాపా రస్తులు' అనే బోర్డు అయితే ఉందిగాని....అసలు వ్యాపారం ఏమిటో ఆ బోర్డుకి తెలియదు....అలా తెలిసింది అక్కడ కూర్చుని అనేక వస్తువుల్నీ కాగితాల్నీ చివరను మనుషుల్ని తాకట్టు పెట్టుకుని అప్పులిచ్చే పార్సీలకి మాత్రమే.

ఆ భవనం గొప్పతనంఏమిటంటే అది పాతభవనం కావడమే. అందుకే దానిని ధనలక్ష్మి తాండవమాడే పవిత్ర స్థలంగా ఎంచుతూ ఉంటారు.దాని పురాతన గాధకి నిదర్శనం అది కొట్టే ముంజు కంపు. ....దాని సాంప్రదాయ సిద్ధి ఇరుకు.

ఇలాటిచోట కూర్చుని ఇన్నాళ్ళనుంచీ వ్యాపారం చేస్తున్నం దుకు యజమానులు గర్వపడుతూ ఉంటారు....యితరులకి ఇలాటి ప్రాచీన శిధిలం లేనందువల్ల వాళ్ళ నిజాయితీని అనుమానిస్తూ ఉంటారు వీళ్ళు.

గాలీ వెల్తురూ....లాల్సకీ, భాయ్‌లకీగాని ప్రాచీనతకీ నిజాయి తీకీ పేరుపొందిన శ్రీపత్ లాల్ అండ్ సన్సుకి అనవసరం అని వారి ఉద్దేశ్యం....ఈ కంపెనీ యజమానుల్లో ఎవరి కొడుకయినా కాస్త తప్పి జారి 'ఈ పాత కొంప బాగుచేయిద్దామా నాన్నా'అంటే చాలు. మిగతావాళ్ళంతా అతనిమీద విరుచుకుపడి, వాడు ఈ వ్యాపారానికి పనికిరాని దరిద్రగొట్టు మొహం అని తేల్చేసేవారు.

కాలదోషంవల్ల వాసన గొట్టినా సమాజం కన్నా గట్టి పునాదులే ఉన్న ఆ భవనం మసిపిని చూసి నవ్వని రోజంటూ లేదు.

కిరకిరలాడుతూ ఇనప గుబ్బల తలుపు తోసుకుని లోపలికి వెళ్ళగానే ముందు హాలు కనిపిస్తుంది. అదో నోరు తెరుచుకున్న గుత్తికొండ బిలం. ఆ హాల్లో ముసలి మార్వాడీ లిద్దరు దిళ్ళనానుకు కూర్చుని హుక్కా పీల్చుస్తూ ఉంటారు—వాళ్ళు కాగితాలు తనిఖీ చేస్తుంటే పాప ప్రభంజనం వీస్తూ ఉంటుంది.

అసలే చీకటి, ఆ పైన వాసన బూజూ దాటి, సింగరేణి బొగ్గు గనుల సొరంగం దాటి ఇంకా లోపలికిపోతే—అక్కడ నడుం ఎత్తని మందభాగ్యులు కొందరు కనిపిస్తారు....డ్రాయర్లు లాగటం వేయటం తప్ప మరో శబ్దం అక్కడ వినిపించదు. బొంబాయినగరం ఎక్కడుందో చచ్చినా జ్ఞాపకం రానిచోటది.

ఆ ఇనప్పెట్టెల్లోంచి తీసి ఇచ్చిన వెండి బంగారాలు మచ్చలు పడి ఇత్తడీ సీసంలా కనిపిస్తాయి—కరెన్సీ నోట్లు ఆత్మహత్య చేసుకుని పిశాచ రూపంలో ఉన్న లక్ష్మీదేవి తాలూకు శిధిలాల్లా ఉంటాయి. అక్కడ ఉండే వాళ్ళంతా వృద్ధుల్లాగే కనిపిస్తారు. ఊరగాయ మాగినట్లు మాగుతూ డబ్బు సంపాదిస్తారు.

ఇలాటి అద్భుత ప్రాచీన కార్యాలయాన్నిచూసి విపుల ఆశ్చర్యపోయింది....కొంచం భయపడింది కూడా. అక్కడి మనుషులందరూ ఆఖరికి టైపిస్టుతోసహా సమాధుల్లో శవాల్లా కనిపించారామెకి.... కాని పని ఉందిగా మరి తప్పదు.

ఛాలియా పది రోజులుతీసి ఆపేసిన పిక్చరుని పూర్తిచెయ్యక పోతే తన గౌరవం నేలపాలయ్యేట్లుంది. అడుగులోనే హంస పాదయితే ఈ బొంబాయి నగరంలో తనకిహ మంచి నీళ్ళుకూడా పుట్టవు. ఆ పిక్చరుని తనే పూర్తి చేద్దామనుకొన్నది ఆమె—తన కెలాగూ సౌత్‌లో పిక్చర్లులేవు....ఈ దెబ్బతో తను బొంబాయిలో స్థిరపడాలనే ఆలోచనతో ఈ శ్రీపత్‌లాల్ అండ్ సన్సులోకి అప్పుకోసం అడుగు పెట్టింది విపుల.

అన్నీ తాకట్టుపెట్టి ఆరు లక్షలు తీసుకుంది ఆమె. వాటిలో త్రివేణి ఒకటి.

సరిగ్గా అదే సమయంలో సావిత్రి ఒక నవాబుగారికి సంగీతం వినిపిస్తోంది....హైద్రాబాద్‌లో ఉన్న హవేలీలలో యార్‌జంగ్‌హవేలీ ఒకటి....ఆయన నవాబు బంధువర్గంలో అతి ముఖ్యమైన వారు—

మొన్నమొన్నటివరకూ వారు ఏ సాంప్రదాయాన్నీ అతిక్రమించలేదు- వంశ మర్యాదకి అనుగుణంగా సేవకులూ గట్టా ఉండేవారు.

ఇప్పుడున్న నవాబు కళాప్రియుడు....హైద్రాబాద్ యావత్తూ తన ఆనందం కోసమే సృష్టింపబడిందనుకొనే అమాయకుడు. అయినా ఇటీవల ఆయన ఆనందానికి తుచ్ఛ ఆర్థిక సమస్యలు అంత రాయం కలిగిస్తూనే ఉన్నాయి. హవేలీలో ఒకప్పుడు ఉన్న శిల్పాలు కనుమాసి మాసిన చీరలు ధరించినట్లున్నాయి—ఊడ తీసి అమ్ము కున్న అందమైన కిటికీలూ దర్వాజాల స్థానంలో మాసిన వెల్వెట్ తెరలు వేళ్ళాడుతున్నాయి....మడ్డి గట్టిన పాన పాత్రలో మధువు తారట్లాడుతున్నది.

ఎలా బ్రతకటమో చేతగాని ఆ ముప్ఫయ్యేళ్ళ రాజవంశీకుడు తాకట్టుబెట్టిన హవేలీ వేలానికొచ్చేరోజుకి దర్వాజాలూ కిటికీలూ సామానూ అమ్మేద్దామని చూస్తున్నాడు....హవేలీ ఉన్న స్థలం పది లక్షలయితే అప్పు దాని ఖరీదుని మించిపోయింది—ఆయన దగ్గిర ఉన్న వెండి బంగారాలూ రత్నాలూ అమ్మితే తొమ్మిది లక్షల రూపా యలు వచ్చినయ్. ఇంకో లక్షా ఏభై వేలుంటే అప్పు తీరి హవేలీ మిగులుతుంది ఇలాటి సందర్భంలో సావిత్రి పాటపెట్టిన రాత్రి వెన్నెలతో సహా వచ్చింది.

నవాబుని చూస్తూనే సావిత్రి ఆశ్చర్యపడిపోయింది. ఇంత అందగాడిని ఆమె పుట్టాక చూడలేదు....కీర్తి డబ్బు సినిమాలూ ప్రణయాలూ సంగీతమూ సర్వమూ మర్చిపోయింది....తనెంత? తన బ్రతుకెంత? తన సంగీతమెంత? ఇతని ఒక్క కాలిగోరుకి వేల కొలది స్త్రీల హృదయాల్ని హారాలుగా అలంకరించుకునే శక్తి ఉంది—ఇతని ఒక్కకంటి చూపుకి లక్షకోట్ల కామినీ సౌందర్యాలు బలాదూరు.

అతని అంగరఖా మాసిపోయింది...అయినా వంద రూపా యలు ఖర్చుపెట్టి పాట వింటున్నాడంటే అది ఆయన కళాప్రియత్వా

నికి నిదర్శనం అని మిగిలిన సేవకులనుకోటం సావిత్రి విన్నది.... దానికీ ఆనందం వేసింది ఆమెకి....విచిత్రం ఏమిటంటే- అతని ప్రతి కదలికా ఆమెకి అందంగా ఆహ్లాదంగా కనిపించటం ప్రారంభించింది. ప్రిన్స్ సలీం పునర్జన్మ ఇదేనేమో?

షాజహాను వారసుడు ఇతనే నేమో? ఏమో....ముగ్ధురాలై పోయిన సావిత్రి సరిగా పాడలేకపోయింది.

పదిరోజుల్లో అంత గొప్ప అందగాడికీ రాజవంశీకుడికీ స్నేహితురాలై పోయింది .. అతనిచ్చిన మాయ ముత్యాలహారం మంచి ముత్యాల హారం అని అందరూ అనబట్టి సావిత్రి నమ్మింది.... గర్వంగా దాన్ని ధరించి తిరుగుతోంది. ఆమె శరీరం మనసూ సర్వం అతనికి అర్పించింది. అలాటపుడు అతని గౌరవం కూడా తనదే కనుక తన సర్వం ఇచ్చి తక్కువైన ఏభయివేలకీ త్రివేణిని చూపించి అతని గౌరవాన్ని కాపాడింది సావిత్రి....తమ ముగ్గురి బ్రతుకులూ కలిపినా ఆ ముత్యాలహారానికి సరిగావని సావిత్రి నమ్మింది—సావిత్రికి జీవిత సమస్య అయిన ఆమె సర్వస్వం. అతనికి కాఫీ త్రాగిన దానికన్న విలువైనది కాదు.

నిజమే. సావిత్రి తన పరువు కాపాడింది...కాని అదేమంత పెద్ద విలువైనది..,కాదు...పది రోజుల్లో అదికూడా మర్చిపోయినాడాయన. మిగిలింది లావాటి ఆడ శరీరం. అది సావిత్రి...ఆమె తాలూకు రెండు గాత్రాలుకన్నా తన పానపాత్ర విలువైనది ఆయనకి. అది ఆయన తప్పూకాదు. ఆయన సాంప్రదాయం తప్పు...ఆయన ధనం తప్పు....ఆయన గత చరిత్ర తప్పు...వాటిదీ తప్పుకాదు... మరి?...మరి?...ఏమో?

అదంతే.

కాలం ఆగలేదు. అది నడుస్తూనే ఉంది.

సావిత్రి భూమిని మర్చిపోయింది...కరుణాకరం రాజశేఖరం

అమృతరావు పోలీసు ఉద్యోగి ఇంకా సినిమా వాళ్ళు అందరినీ మర్చి పోయి నవాబుగార్నే పూజిస్తోంది.

"ఏజన్మలోనో నాకు రుణం ఉంది అలా చేశాను కాని జన్మజన్మాలకీ భర్త సాయెబుగారే" అంది గణపతితో.

"వెంకటేశ్వరస్వామికి మొక్కుకోండి" అన్నాడతను. ఆ మాట వెటకారంగా అన్నాగాని సావిత్రి వినిపించుకోలేదు. ఎందు కంటే ఆమె నిజంగానే మొక్కుకుంది.

"నా మనసులో ఉన్న విషయం నీకు అర్థం కావటంలేదు గణపతీ! ఇదివరకులా కాదు. నేను ఆయన్ని ప్రేమిస్తున్నాను. ఎంతో గాఢంగా ప్రేమిస్తున్నాను. నా బ్రతుక్కంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాను...."

"కానీవమ్మా, ఎవరొద్దన్నారు?"

"గణపతీ,..,నువ్వు మంచి వాడివి..,త్రివేణిలో నా భాగం నాకు ఇప్పిస్తే నీ ఋణం ఉంచుకోను" అంది సావిత్రి.

గణపతి గతుక్కుమన్నాడు...ఈ ముగ్గురుకీ మధ్య రవరవలు ప్రారంభమైనాయని లోకానికి తెలియకపోయినా తనకు తెలుసు... ఈ త్రివేణి చీలిపోతుందని ఎవరైనా అంటే చీల్చేసే సావిత్రి... ఇలా అనటం వలన అ రవరవలు ఎటునుంచి రాజుకుంటున్నాయో అతనికి అర్థం కాలేదు. అందుకే హరినారాయణసేట్ దగ్గరికి వెళ్ళి చింతామణీ సావిత్రీ అన్నమాటలూ, విపుల బొంబాయి వెళ్ళటం పూసగుచ్చినట్లు చెప్పేశాడు.

సేట్ కాసేపు ఆలోచించి—"ఈ విషయాలు ఎవరితోనూ చెప్పకు. అలాటి ఇల్లు కొనాలని చాలా రోజులనించీ అనుకుంటు న్నాను...నీకు కమీషను ఇస్తాలే..,రాజీ గీజీ అనకు..."అన్నాడు అదోలాగా కన్ను కొడుతూ.

సేట్ ఈ మధ్య లాలస అంటే అభిమానం చూపిస్తున్నాడు... వయసునీ మనసునీ మార్కెట్‌లో పెట్టకుండా కేవలం ప్రతిభతోనే పైకొచ్చిన ఆ తార అంటే అతనికి ఇష్టమేకాదు, గౌరవంకూడా ఉంది. గణపతితో ఆమాటే అన్నాడు.

"ఈ సినిమాల్లో పైకి రావాలంటే అడ్డమైన పనులూ చెయ్యాలనే అపనింద ఉండేది... నేనూ కాబోలనుకున్నాను గణ పతీ—కాని లాలస అలా కాదని నిరూపించింది. కళలు అవినీతికి మూలం అనే వాళ్ళందరూ లాలసనిచూస్తే బాగుండును...సర్లే, కాళ్ళల్లో నిప్పు రాజుకోనీ" అన్నాడు సేట్.

## 22

బ్రతుకులో ఎవరైనా తప్పుదారి తొక్కటానికి కారణం మంచి దారిలో ఉన్న సుఖం తెలియక పోవడమే—అనుకుంది చింతా మణి...ఎదురుగుండా కూర్చున్న సావిత్రి ఎక్కిళ్ళు వినిపిస్తూనే ఉన్నాయి. ఆ ముత్యాలహారం మాయది.

నవాబుగారి అల్పత్వాన్ని గురించి చింతామణితో చెప్పుకున్న కొద్దీ దుఃఖం ఎక్కువయింది ఆమెకి.

"ఏడవకు సావిత్రీ! మనకి ప్రేమేమిటి? అవమానమేమిటి? మన మొహం" అంది చింతామణి మెటికలు విరుచుకుని ఆవలిస్తూ.

"అదికాదు చింతీ...నాకు బ్రతకాలనే లేదు."

"ఏమిటీ? ముత్యాలహారం కోసమా?"

"బ్రతకాలని లేదు-అంతే."

"నీ మొహం."

"ఈయన కోసం నేనెంత చేశానో అందులో పదోవంతు కూడా ఇతర్ల కోసం చెయ్యలేదు. ఆఖరికి నా కోసంకూడా చేసుకోలేదు. ఉన్న డబ్బంతా నీళ్ళలాగా వాడేశాను...చివరకి..."

"ఇప్పుడఘోరించి ఏం లాభం? ఉన్న డబ్బంతా వాడేశావా ఏమిటి?" అంది చింతామణి.

సావిత్రి మాట్లాడలేదు. ఎందుకో ఆమెకు భయం వేసింది చింతామణి ఇదేమీ గమనించకుండానే తిరిగి అంది;

"ప్రేమ పేరెత్తితేనే ఛండాలం...ఇందులో కొంత తప్పు నాదీ ఉంది—విపుల లేకపోయినా నేనయినా నిన్ను హెచ్చరించి ఉండాల్సింది, అప్పుడీ ఏడుపువరకూ వచ్చేది కాదు...సరే, అతన్ని విడిచేద్దూ...ఏడవటం దేనికి? అలా ఏడుపొస్తుంది నిజమే. అయినా మన తెలివి ఉపయోగించద్దూ?"

"ఎందుకో సిగ్గేస్తోంది."

"సిగ్గు...చిన్నానాడే పోయింది. కాకపోతే నీకు అర్థమయిం దిప్పుడు. అసలలాటి వాళ్ళతో స్నేహం పెంచుకోవటమే తప్పు. మన బ్రతుక్కి సామాన్య మానవులతోనే తంటాగా ఉంటే ఈ నవాబులు తక్కువయ్యారా ఏమిటి!"

"అతన్ని ప్రేమించాననే మర్చిపోతే పీడా వదిలి హాయిగా బ్రతకొచ్చును."

"విపులకీ వాళ్ళకీ మొహం ఎలా చూపను?"

"మరేం ఫరవాలేదు, హాయిగా చూపచ్చును. నాలుగు రోజులు గడిస్తే అన్నీ మర్చిపోతాం. అసలా విపుల మాత్రం ఇప్పుడు....సరేలే, ఏడవకు" అంది చింతామణి సావిత్రి మళ్ళీ ఎక్కడేడుస్తుందో అని భయపడుతూ.

సావిత్రి ఏడవలేదు....అసలే నీరసంగా ఉందేమో చింతామణి సలహాతో. సగం చచ్చినట్లయింది....అక్కడినుంచి గణపతి ఇంటి కెళ్ళింది. అతను లేడు.ఎక్కడికో వెళ్ళాడని ఇంట్లో వాళ్ళు అన్నారు.

ఏం చెయ్యాలో తోచలేదు సావిత్రికి. ఈ గోలంతా ఏమిటో? తనకి ప్రణయం,దాని తాలూకు నిరాశకన్న డబ్బు తగలడిపోయిందన్న బాధే ఎక్కువగా ఉంది. త్రివేణిని చీల్చిన సంగతి ఇంకా ఎవరికీ తెలియదు... ఎలాగైనా సాయిబుగార్ని మంచిచేసుకొని- ప్రేమపోతే పీడాపోయింది, డబ్బన్నా తెచ్చుకుందామని నిర్ణయించుకొంది ఆమె.

త్రివేణిలోకి చింతామణి దగ్గరకి వెళ్ళటానికి ఎందుకో భయంగా ఉంది....విపుల వస్తే ఇహ ఋణం తీరినట్లే!

టాక్సీ ఎక్కి నవాబు సాయిబుగారి దగ్గరకి వెళ్ళింది సావిత్రి నవాబు గారు విశ్రాంతి తీసుకుంటున్నారని చెప్పారు.

"వెళ్ళి నేనొచ్చానని చెప్పు" అంది పాత చనువు బీటలు వారిన సంగతి పైకి తెలియకుండా.

నౌకరు కబురుతెచ్చే వరకూ ఉండటం అలవాటు లేనందున అతనితోనే లోపలికి వెళ్ళింది. ఆమె రావటం చూసి హుక్కా త్రాగుతున్న నవాబుగారు తల తిప్పుకున్నారు.

"ఒక్కరోజు చూడకపోతే మతిపోయింది. ఆరోగ్యంగా ఉన్నారుగద" అంటూ వెళ్ళి ఆయన చెయ్యి అందుకుంది.

ఆయన మాట్లాడలేదు.

"ఏమిటీ మౌనం? అదంతా కోపమేనా?"

ఈ తడవ అసలు జవాబు రాలేదు.

"ఏమో బాబూ.........మీకు కోపం వస్తే నాకు చీకటిగా ఉంటుంది...."

"...................."

"మీరిలా మాట్లాడకపోతే నా గతేం కాను?"

"దయచేసి తమరు వెళ్ళండి. నాకు చాలా పని ఉంది" అన్నా డాయన కఠినంగా.

సావిత్రికి పూర్తిగా మతిపోయింది. కోపం వచ్చింది.

"మీకోసం నా సర్వం ధారపోశానే....ఇప్పుడెలా?" అని కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"మీ మగవాళ్ళే అంత...మనపిచ్చి బాగుపడిన దెవరు?" అని వగలుపోయింది.

"ఆ డబ్బయినా పారేయండి తిండికి వెతుక్కోకుండా" అని అస్త్రం వదిలింది.

"పొమ్మని చెప్పతుంటే నీక్కాదూ...అలీ!" అన్నాడాయన.

ఆయన కఠినుడు కాదు. ఈ మధ్య సావిత్రి తన చుట్టం అయిన మరో ఆయనతో తిరుగుతోందని ఆయనకి నమ్మకంగా తెలిసింది.

"పోతాను....ఇంతటితో మిమ్మల్ని ఒదులుతా ననుకుంటున్నారేమో........" ఈ మాట జారినాక భయంతో చెమటలు పట్టినాయి ఆమెకి.

"ఛుప్....ముందుపో బయటికి" అన్నాడాయన.

సావిత్రికి అవమానం నిరాశ కోపం ముంచుకు వచ్చినాయ్... ఏం చేస్తుంది? వెళ్ళి టాక్సీలో కూర్చుని ఏ త్రివేణికిపోవటానికి ఇష్టం లేదో ఆ త్రివేణికి వెళ్ళింది.

కారు ఆగగానే గణపతి వచ్చాడు.

"చింతామణి వచ్చిందా?"

"ఇంకా రాలేదండీ" అన్నాడతను.

సావిత్రి సోఫాలో కూలబడి బావురుమంది. గణపతికి విషయం తెలుసు. ఈ విధంగా దెబ్బతింటుందనీ తెలుసు. అయినా అడిగాడు.

"ఎందుకు ఏడుపు?—అసలేం జరిగింది?" అని రొక్కించి అడిగాడు.

సావిత్రి ఏడుపు ఆపలేదు.

"ఈ నవాబు కాకపోతే మరోడు ...ఈ దేశంలో వాడొకడే అందగాడూ కాడు, భాగ్యవంతుడూ కాడు. ఇంకా ఉన్నారు."

సావిత్రి ఏడుస్తూనే గణపతి చెయ్యిపుచ్చుకొని "ఎక్కడి కయినా వెళ్ళిపోతాను గణపతీ- ఇహా ఇక్కడ ఉండలేను" అన్నది.

"ఏమిటమ్మా, ఎందుకు?"

"నవాబుగారికీ నాకూ ఋణం తీరింది గణపతీ!" అన్నది సావిత్రి.

గణపతి ఇంకా ప్రశ్నలడిగి బాధించదల్చుకోలేదు. సేట్ ఇచ్చే కమీషనే అతని కళ్ళముందు ఆడింది.

"పోనీండి....అప్పు తప్పు అర్థంలేని వాడికోసం ఇంతసేపు ఏడవాలా? అదీ ఒక విధంగా మంచికే వచ్చింది. మీ రీమధ్య ఆ మోజులోపడి వృత్తి చెడగొట్టుకున్నారు. ఏం ఫర్వాలేదు" అని ధైర్యం చెప్పాడు గణపతి.

అయినా సావిత్రి యేడవటం మానలేదు. యేడుస్తూ సామాను సర్దుకుంది....ఏడుస్తూనే ఇల్లంతా కలయ తిరిగింది. కుక్కల్ని, మొక్కల్ని చూసుకుంది. తరువాత ధైర్యం తెచ్చుకుని వెనక్కి తిరిగి చూడకుండా టాక్సీ ఎక్కింది.

"వెళ్ళి రండి, మనశ్శాంతిగా ఉంటుంది" అన్నాడు గణపతి, ఆమె ఎక్కడికి వెడుతోందో తెలుసుకోకుండానే.

టాక్సీ బయలు దేరింది. గేటు దాటగానే ఒకసారి తిరిగి చూసింది సావిత్రి. కన్నీటి మసకల కవతల మసగ్గా ఉన్నదా యిల్లు. ఏడుపు ఆగలేదు.

ఒకప్పుడు తన బ్రతుకూ కలకలలాడుతూనే ఉంది- ఈ ఇంటి లాగా. ఇప్పుడీ ఇల్లు తను చేసినపనితో చెయ్యిజారిపోయింది. తను చేసిన బాకీ తీర్చి విపులగానీ చింతామణిగానీ నిలుపుకోవచ్చును.... అసూయ పట్టలేకపోయింది.

ఏమిటో పాడుబ్రతుకు....మరలాగా గిర్రున తిరిగింది కళ్ళ ముందు....ఒక్కో ఘటన ఇంకో ప్రకరణం,మరో అధ్యాయం... ఎవరి జీవితపు విలువలు వారివి. ప్రవహించిపోయే నీటిలాగా ఉంటుం దనుకుందిగాని ఇంత మురికీ అసహ్యం ఉంటాయని అనుకోలేదు.... జ్ఞాపకాల సుడిగుండాలు ప్రాణాలు తీస్తున్నాయ్....ఒక బ్రతుకునుంచి పారిపోతోంది తను. ఇహముందు తను బ్రతకపోయేదేమిటో తనకే తెలియదు. బ్రతుకింతేనా? నలిగినదారి నుంచి నవీన మార్గానికి రోడ్లు వేసుకోటమేనా? కన్నీళ్లు తుడుచుకుంది సావిత్రి.

రైల్లో కూర్చుని ఆ మహానగరం వెనకపడిపోయే వరకూ చూసింది....కోపం వచ్చింది. ఎక్కెక్కి ఏడుపూ వచ్చింది. మళ్ళీ ఓ తడవ బావురుమంది.

భూమి గుండ్రంగా ఉంటుందన్నట్లు ముందా వరంగల్‌లో అమృతరావుగార్ని కలుసుకుని, ఆయన దారి చూపకపోతే ప్రకాశరావు గారి దగ్గరకు వెళ్ళాలనుకుంది....ఇంకా తనకి ఓ చిన్న ఇల్లుంది ... అవును- ఉన్నది. దాని సంగతే తను మరిచిపోయింది.

## 23

విపుల తన సర్వాన్ని తాకట్టు పెట్టి- 'లాల్ దర్వాజా' పూర్తి చేసింది. సినిమాకి ఆ పేరు బాగుందని నలుగురూ అన్నారు....

అయితే ఛాలియా కన్నా మోసగాడు డిస్ట్రిబ్యూటరు రాయియా.... పిక్చరు వచ్చేవారం విడుదలకి సిద్ధంగా ఉన్నా ఇంతమటుకు పబ్లిసిటీ మొదలు పెట్టలేదు. అందుకోసమే కుండపోతగా వర్షం పడుతున్నా రాయియా ఆఫీసుకు బయలుదేరింది విపుల.

అప్పుడే టీ త్రాగి ఆఫీసు కిటికీలోంచి ఆకాశాన్ని చూస్తూ ఆవలిస్తున్నాడతను. అప్పుడు డాన్సర్ సోహినీ కుమారి ఉంటే ఎంత బాగుండు ననుకుంటూ. ఇంతలో అతని దృష్టి కారు దిగుతున్న విపుల మీద పడింది. ఫరవాలేదు, ఎవరయితేనేంలే అని సరిపుచ్చుకుందా మనుకున్నాడుగాని ఆ వెనక దిగుతున్న అసిస్టెంట్లని చూసి ఉత్సాహం అంతా పోగొట్టుకున్నాడు.

"ఏమిటి సంగతులు మేడమ్?" విపులని మర్యాదగా పలకరిస్తూ అడిగాడు రాయియా.

"సెన్సారులో పిక్చర్ పాసయిపోయింది. రెండు మూడు కట్ చేసినా మొత్తానికి పని జరిగిపోయింది. సర్టిఫికేట్ రేపిస్తారు" అంది విపుల... ఈ సినిమా ఫెయిలయితే తను మళ్ళీ విశాఖపట్నం చేరుకోవాల్సిందే.

రాయియా సంతోషపడుతూ అన్నాడు-"కంగ్రాచ్యులేషన్స్!"

"పిక్చరు తయారయింది.... ఛాలియా మధ్యలో ముంచినా ప్రొడక్షన్ పూర్తిచేశాను. ఇప్పుడు ఎక్స్ప్లాయిటేషను పని మీది" అంది విపుల నవ్వుతూ.

ఆమెతో వచ్చిన అసిస్టెంటు డైరెక్టరు అందుకుని "అవును రాయియా సాబ్.... మేడమ్ చాలా కష్టపడి ప్రొడక్షన్ పూర్తిచేసింది. కాని ఎక్స్ప్లాయిటేషను సరిగ్గాలేదు" అన్నాడు.

"రోడ్లమీద గోడలమీద పోస్టర్లులేవు.... పత్రికల్లో పబ్లిసిటీ లేదు. విడుదలకి ఇక వారమే ఉంది.... పబ్లిసిటీ లేకపోతే పిక్చరు

దెబ్బతింటుంది....మన పిక్చర్‌తో పాటు విడుదలయే 'రుమాల్'కు ఎంత ప్రచారమో చూడండి" అంది విపుల.

"మీరు చెప్పేది కాదనటంలేదు మేడమ్! కాని, డబ్బు కావాలి గద...." అన్నాడు రూయియా గోళ్లు కొరుక్కుంటూ.

"కావాలి....అందుకుని పబ్లిసిటీ మానేస్తామా?"

"ఎంత డబ్బని ఇవ్వను? ఇప్పటికే తడిసి ముప్పందుల అయినాను."

"కావచ్చును సార్, అందుకని యేం చేస్తాం? ఓ యాభై వేలు పారేస్తే దేశం అంతటా పబ్లిసిటీ జరుగుతుంది."

"ఇంతెందుకు ముప్పయ్యారు వేలిస్తాను. ఏభయివేలకి నోటు వ్రాయండి- మూడు నెల్లు గడువు."

"అంటే...ఆఫ్‌షేరు కాకుండా ముప్పయ్యారు వేలకీ మూడు నెలల్లో యేభయివేలు వేసుకుంటారని మాట. అంటే పద్నాలుగువేలు వడ్డీ...సెంట్‌పర్‌సెంట్‌కి మించిపోయింది...అంతేనా?" అంది విపుల కోపం ఆపుకుంటూ.

రూయియా కూడా కోపంతో అన్నాడు: "ఫిల్మ్ ఇచ్చి స్టూడియో ఇచ్చి సహాయం చేసినందుకు ప్రతిఫలం యేమిటి?"

విపుల మండిపడుతూ అన్నది: "మీకు సగానికి సగం లాభం వస్తుంది మిస్టర్ రూయియా! మీ రిచ్చిన నయాపైసకి నయాపైస వసూలు చేస్తారు. ఫిలిం సక్సెసయితే చటుక్కున సగానికి అధికార్లై కూర్చుంటారు....మీరిచ్చినవేవీ ఊరికే ఇవ్వలేదు, పిక్చరుని తాకట్టు పెట్టుకుని ఇచ్చారు....ఒకవేళ నష్టం వస్తే అందులో మీకేమీ వాటా ఉండదు. అంతేనా?"

"ఏమన్నా అనుకోండి మేడమ్, నేను వ్యాపారం చెయ్యటానికి కూర్చున్నానుగాని దానధర్మాలు చేయటానికి, సత్రాలు వెయ్యటానికీ కాదు."

"వ్యాపారం....దీన్ని వ్యాపారం అంటారా సేట్? ఇది నడి రోడ్డులో వట్టపగలు దోపిడీ."

"నిజం చెపితే అంతే మేడం....అనవసరంగా ఆవేశపడ కండి. ఇది ఆఫీసు" అన్నాడు రూయియా.

అతనిమాటలకి విపుల రెచ్చిపోయింది. "ఆఫీసా ఇది? కసాయి దుకాణంగాని" అంది అరుస్తూ.

"నాకు టైములేదు. మీరింకేమయినా మాట్లాడతారా?" వాచీ చూసుకుంటూ అన్నాడు రూయియా.

"ప్రాణాన్ని ఒడ్డి ఈ సినిమా తీశాను. ఇప్పుడు పబ్లిసిటీ లేకుండా దాన్ని దివాళా తీయిస్తే సముద్రమే గతి."

"పబ్లిసిటీ లేదని ఎవరన్నారు?"

"అయితే డబ్బు యివ్వండి. రిలీజుకి వారమే ఉంది" అన్నది విపుల నీరసంగా.

"ఇస్తాను....మీకు కోపం వచ్చింది కనుక ఈ డబ్బుమీద నాకు వడ్డీ వద్దు. నా ఏభై పైసల భాగాన్ని డెభ్భైఅయిదు పైసలకి పెంచండి" అన్నాడు రూయియా.

"ఏమిటీ?" అన్నాడు అసిస్టెంట్ డైరెక్టర్.

"ఏమన్నారు మీరు?" మండిపోతూ అన్నది విపుల.

"డెభ్భైఅయిదుపైసలా?" అన్నాడు అంతవరకూ మాట్లాడ కుండా కూర్చున్న మరో అసిస్టెంట్.

"అవును. ప్రాఫిట్‌నుంచి" అన్నాడు రూయియా.

"డెభ్భైఅయిదు పైసలు మీవీ....ఇరవయిఅయిదు పైసలు నావా?" అంది విపుల. తను నిర్మాత అయిన దగ్గరనుంచీ అలవరచు కున్న శాంతం రూయియా కసాయి ఆశముందు కప్పపడిపోవటం వలన అతనివంక అసహ్యంగా చూస్తూ అన్నది:

"మూడు వంతులు నీకూ,ఒక వంతు నాకూనా? స్కౌండ్రల్!
....విశ్వాసఘాతకుడా!....నా లోకువని చూసుకుని లాభం పొందాలను
కుంటున్నావురా, రాస్కెల్! నేను పిచ్చిదాన్ననుకున్నావా? నీలాటి
వెధవల్ని లక్షమందిని చూశాను."

"షటప్! ఆడదానివని ఊరుకుంటున్నాను. ఇహ అట్టే మాట్లా
డక" అన్నాడు రూయియా.

"ఊరుకోండి మేడమ్! పురుగుని తిట్టి లాభమేమిటి?"
అన్నారు అసిస్టెంట్లు....

విపుల ఆ మాట వినిపించుకోలేదు.

"నల్లబజారులో కాజేసిన డబ్బంతా నీతో వస్తుందా చచ్చి
నప్పుడు? మిమ్మల్ని నడిరోడ్డులో నిలబెట్టి చావబాదే రోజు రాక
పోదు....నీ షరతు ఒప్పుకుంటున్నాను. తీయ్ డబ్బు" అన్నది.

"మేడమ్...."

"ఫరవాలేదు జానీ! ఈ రాస్కెల్ అన్యాయంగా సంపాదించిన
డబ్బు అట్టే ఉండిపోదులే!"

"మీరు న్యాయంగా సంపాదించారు కాదూ? ఎంతమందిని
ఆర్పుతేనోగాని సినిమా తీయలేరు. ఎందుకొచ్చిన మాటలు గానీ....
ఇదిగో కాగితం, సంతకం చేయండి" అన్నాడు రూయియా.

విపుల మాట్లాడలేదు. అతనన్నదాంట్లో ఆవగింజంతన్నా
అబద్ధంలేదు. ఎంతమందిని ఆర్పుతేనోగాని ఎవరూ పైకి రాలేరు.

మాట్లాడకుండా సంతకంపెట్టి చెక్కు తీసుకుంది విపుల—
ఒంటరిగా వస్తే ఈ తిప్పలు ఉండేవికావు.

## 24

నాలుగు రోడ్లు కలిసేచోట తానాదగ్గర 'లాల్ దర్వాజా'తాలూకు
రంగు రంగుల పోస్టర్లు అంటించి ఉన్నాయి.

పెట్రోల్ బంక్ దగ్గరా, దాని ఎదురుగ్గా దేవాలయం గోడ మీదా, హిమాలయా వారి 'లాల్ దర్వాజా' చిత్రవిచిత్ర కళాకృతి.

హీరో శ్రీకాంత్, హీరోయిన్ విపులాదేవి....డైరెక్టర్ అరోరా....నిర్మాత విపులాదేవి.

బాంబే అంతా ఎనభై బేనర్లు, నూట ఏభై పోస్టర్లూ అంటించారు.

ఇహ మూడు రోజులకు విడుదల అవుతుందనగా అప్సర థియేటర్ని అలంకరించసాగారు. పెద్ద బేనర్ మీద విపులాదేవి బొమ్మ నవ్వుతూ, సెక్సీగా నిలబడి ఉంది....ఆమె నవ్వులో కామం, రాక్షసత్వం కనిపిస్తున్నాయి. ఆవిడ గడ్డంమీద మచ్చ వాటిని మరింత విలక్షణంగా కనిపించేట్లు చేస్తోంది.

"బొమ్మ బ్రహ్మాండంగా ఉన్నట్లుంది...." అన్నాడు వొక కుర్రాడు.

రాత్రి ఒంటి గంటయింది. ఇంకా తోరణాలు కడుతూనే వున్నారు.

హోటల్లో పనిచేసే కుర్రాళ్ళంతా బయటకి వచ్చి ఆ అలంకారాన్ని చూస్తున్నారు....టాక్సీ డ్రైవర్లూ-టాంగావాలాలూ, ఆవారాలూ అందరికీ విశ్రాంతి సమయం అదే.

"ఈ విపుల సౌతిండియన్ అయినా అందంగానే ఉందే.... మంచి యాక్షన్ అని కూడా స్క్రీన్ వ్రాసింది" అన్నాడు చదువుకున్న టాక్సీ డ్రైవరొకడు.

"రేపు ఉదయంనించీ టికెట్లకి క్యూలో నిలబడుకుంటే నాలుగు డబ్బులు సంపాదించుకోవచ్చును. అరే ఆలీ, రేపు నీకూ పనిలేదుగా?" అన్నాడు మరో హోటలు కుర్రాడు.

....విపులాదేవి వస్తున్న కారుని చూసి అరిచారు కొందరు.... విపుల థియేటరు అలంకరణ చూసి సంతోషపడి వెళ్ళిపోయింది. తెల్లవారటానికి ఇంకో నాలుగు గంటల టైముంది. అయినా ఆమెకు నిద్ర పట్టలేదు—సేట్ అన్న మాటలే చెవులో గింగురుమంటున్నాయి....

అవును, తను మాత్రం న్యాయంగా సంపాదించిందా?........
లేదు........

ఆలోచనల్ని అణచుకోవాలని బలవంతంగా ప్రయత్నించినా ఆమెకు నిద్రపట్టలేదు....

బీరువా తీసి నాలుగు ఎర్రని కాప్స్యూల్స్ మింగి ఓ గ్లాసుడు నీళ్ళు కాగింది.

ఒకవేళ ఈ బొమ్మ 'పే చెయ్యకపోతే?....ఏమవుతుంది?.... విశాఖపట్నం సముద్రతీరం....ప్రశాంతమైన అలలు... ఏనుగులాటి యేరాడకొండ....అస్తమించి ఉదయించే సూర్యుడు........

కళ్లు బరువెక్కి....ఒళ్ళు తేలిపోయింది....బాహ్యస్మృతి పూర్తిగా పోయి సుఖనిద్రలోకి జారింది ఆమె....

హాయిగా,...చల్లగాలిగా...,తెల్లవారింది. నిద్రలేచిన విపులకి ఈరోజు చావు బ్రతుకుల సంధి. అద్దంలో చూసుకుని నిట్టూర్చింది ఆమె.

మధ్యాహ్నం పన్నెండు గంటలనుంచీ జనం గుంపులుగుంపులుగా అప్సర థియేటర్‌ముందు నిలబడి ఉన్నారు.....మాట్నీకి హాలు పూర్తిగా నిండిపోయింది.

ఫస్ట్ షో ఇంకా ప్రారంభించలేదు. గేటుముందు ఆర్క్‌లైట్లు' కెమెరాలూ అమర్చారు...కార్లు దిగుతున్న కళాకారుల్ని చూసి కెమెరాలు ఫోటోలు తీస్తుంటే జనం చప్పట్లు కొడుతున్నారు.

మెరిసిపోతున్న బంగారురంగు చీరా...వెండిరంగు స్లీవ్‌లెస్ చోళీతో దిగిన విపులాదేవి అప్సరసలా మెరిసిపోతున్నది...రూయియా, ధాలియా...ఇంకా కొందరు ప్రముఖులూ ఆమెతో నడుస్తున్నారు.

థియేటరు లాంజ్‌లో మరికొంతమంది పెద్దవాళ్లు ఉన్నారు. విపుల తన లోపలి భయాన్నంతా అణచుకుని చిరునవ్వులు ప్రసారం చేస్తూ అందరినీ పలకరించింది.

చాలా ఫ్లాష్‌లు తీయబడినాయ్.

వెంటనే థియేటరులో పెద్ద నక్షత్రాలలాగా మెరుస్తున్న లైట్లు ఆరిపోయినాయి.

విపుల కంగారుని అణచుకుంటూ నాలుగువేపులా చూసింది.

థియేటరు నిండిపోయింది.

అయితే రెండవ ఆటకి జనం తగ్గారు. మొదటాట ఇంట్రవ ల్లోనే జనానికి నీరసం వచ్చింది.

"ఎలా ఉంది?"

"బాగాలేదు."

"ప్రేక్షకులేమంటున్నారు?"

"ఏడిపినట్లుందిట."

విపుల మొహం వాడిపోయింది. జబ్బుపడ్డదానిలా అయి పోయింది ఆమె—

ఆమె మొహం చూసి హీరో అన్నాడు: "చూడండి మేడమ్! ....కళాఖండానికి విలువ కట్టలేం....తృప్తే తప్ప. కళని కొననూ లేము, అమ్మనూ లేం" అన్నాడు....ఆఖరి కాల్‌షీట్‌కి పూర్తి డబ్బు ఇవ్వందే రానన్నది అతనేనా? అని అనుమానం వచ్చేలాగా.

"కమ్మర్షియల్ ఆర్టు వస్తే బాగానే తెస్తుంది.లేకపోతే అంతే" అన్నాడు ఒడ్డున కూర్చున్న మరో పెద్దమనిషి.

విపుల మొహాన కత్తివేటుకి నెత్తురుచుక్కలేదు....ఇంచు మించు అచేతనంగా కూర్చుంది.

ప్రేక్షకులకు సినిమా బాగాలేదు. ఇంటర్‌వెల్ తరువాత మరింత అసహ్యంగా ఉంది. విపుల హిందీ ఉచ్చారణ సరిగ్గా లేక పోవటంవలన పిల్లికూతలూ, నక్కకూతలూ ఎక్కువయినయ్.

"వీళ్ళు ఎందుకు అరుస్తున్నారు?" సెకండ్ హీరోయిను లోపల సంతోషాన్ని అణచుకొంటూ అడిగింది.

ప్రజలు ఎందుకు అరుస్తున్నారో ఆమెకి తెలుసు...ఈ సౌతిండియన్ స్టార్ మొదట్లోనే పట్ట కొట్టినందుకు ఆమె హాయిగా నిట్టూర్చింది. 'లాల్ దర్వాజా' తుక్కు పిక్చరని మొదట్లోనే గ్రహించి తన జాగ్రత్తలో తనున్నందుకు తనని తనే అభినందించుకున్నాడు రూయియా.

విపుల తమిళ తారలాగా నటించింది. ఆమె హిందీ ఉచ్చారణలో అరవ యాస కనిపించింది...చిత్రం ఏమిటంటే—హిందీ తెలుగూ కాకుండా అరవతనం కనిపించటం.

అక్కడికీ ముందే తన మనుషుల్ని ఏర్పాటుచేపింది—చప్పట్లు కొట్టటానికి...డాన్సులు ఒచ్చినప్పుడు ఈలలు వేయటానికీ, హాస్య సంఘటనలో నవ్వటానికీ కూలీ ఇచ్చి పాతిక మందిని పెట్టినా కథ అడ్డం తిరిగింది. పక్కవాళ్ళు వీళ్ళని తిట్టి నోరు మూయించారు.

"ఎవరో అసూయచేత ఫెయిలు చేయటానికి మనుషుల్ని పెట్టినట్టున్నారు." ఒకాయన అన్నాడు.

"ఎవరయి ఉంటారు?"

"అదే...ఆ మద్రాసు తార శోభన కుమారి అయి ఉంటుంది." జవాబు.

"నేనూ అదే అనుకుంటున్నాను." అసిస్టెంటు డైరెక్టరు హామీ.

"నేనలా అనుకోవటం లేదు," ఇంకెవరో అన్నారు.

పూర్తిగా ఇరవయి నెలల కాలం-పాతిక లక్షల వ్యయం... కాని పిక్చరు ఫెయిలయిపోయింది.

"బాగా అయింది. అంతే కావాలి ఈ సినిమా జనానికి." ఎవరో పెద్ద మనిషి అన్నాడు.

విపుల ఏడుపు ఆపుకుంటూ అటు చూసింది. ఆ పెద్ద మనిషి ఆపలేదు.

"ఈ సినిమాలు లోకాన్ని నాశనం చేస్తున్నాయి. ఈ సినిమాలూ, సినిమావాళ్ళూ ఎంత త్వరగా నాశనమైతే అంత మంచిది" అన్నాడు. విపుల కోపంగా లేచింది...వెంటనే సినిమా అయిపోయి "జనగణమన" వినిపించ సాగింది. అది అయేవరకూ ఉండి అనంతరం ఆ పెద్ద మనిషిని సమీపించి "ఏమిటి పేలుతున్నావ్?" అంది విపుల.

ఆ పెద్ద మనిషి మొదట తెల్లబోయినా భార్య ఎదట తన గౌరవాన్ని నిలుపుకోవాలి గనుక తమాయించుకొని తిరిగీ అన్నాడు; "నేను అనాలనే అన్నాను, మర్యాదగా మాట్లాడండి." అక్కడున్న వాళ్ళంతా తెల్లబోయి విపులవైపూ, ఆ పెద్ద మనిషివైపూచూస్తున్నారు.

"విపులాదేవీ...ఏమిటిది?" అంది సైడ్‌హీరోయిను కంగారు పడుతూ.

"నువ్వూరుకో...ఈ కాలంలో సినిమాల్ని తిట్టటం, సినిమా వాళ్ళని అవినీతి పరులనటం అందరికీ ఫాషన్ అయిపోయింది... సినిమాల్లో చేరకముందు నేనూ కష్టపడి బతికిన దానినే...సమాజపు జీవగఱ్ఱలైన భావి భారత పౌరులు నన్నెంత అవమానించారో చెపితే సిగ్గుతో మీ తలలు ఒంగిపోతాయి. సినిమాలో మేము పని చెయ్యకుండా కూర్చోం. కష్టపడి కూడు సంపాదించుకుంటాం. బాధల్ని అణచుకొని భావాలు చూపించాలి. ఎండనే వెన్నెల అనుకొని ప్రేమ గీతాలు పాడాలి. అసహ్యించుకొనే వ్యక్తిని పూజించాలి...పూజనీయుల్ని చెప్పు తీసుకుకొట్టాలి,..ఇదంతా దేనికి? రూపాయి డబ్బులతో ఆనందాన్ని కొనుక్కునే మీ కోసం..."

ఉన్మాదినిలా చెప్పుకు పోతోంది ఆమె.

"దేశంలో నవచైతన్యానికీ...సమాజంలో మార్పు తేవటానికీ హిందీని దేశం అంతా వినిపించటానికీ సినిమాలు పనికొస్తాయనే

చిన్ని విషయం కూడా తెలియని మీరెందుకు సంస్కారులమని డబ్బా కొట్టుకుంటారు?...సరే పెద్దమనిషి, నీమాటప్రకారమే సినిమాలూ, సినిమావాళ్ళు నాశనం అయి, సినిమాలు మూసేస్తే ఏమవుతుందో తెలుసా? మీ యువకులు సాయంత్రం అవగానే వ్యభిచార గృహాలకి పరుగెత్తుతారు. మీ భార్యలూ, చెల్లెళ్ళూ ప్రేమకలాపాలకి దిగుతారు- పెద్దమనుషులయిన మీరంతా పేకాటకీ త్రాగుడుకీ అలవాటవుతారు... ఈ సినిమాలు ఉండటంవలన కోట్లాది ప్రజలు అర్ధరూపాయితో ఆనందాన్ని పొందుతున్నారు...సినిమాలు మూసివేస్తే అయిదారు లక్షల మంది నిరుద్యోగు లయిపోతారు....పదిహేను కోట్ల రూపాయిల పన్ను ప్రభుత్వానికి నష్టం అవుతుంది...ఇదికాక ఆదాయప్పన్ను వేరే ఇస్తుంది సినిమా..."

అక్కడున్న అందరూ విపులమాటల్ని తెల్లబోయి వింటున్నారు.

"విను....కాలేజీలూ, ఆఫీసులూ, ఆస్పత్రులూ సేవచేసినట్లే సినిమాలూ సేవ చేస్తున్నాయి. ఇహ అవినీతి అంటారా? తెరమీదేనా? తెరచాటు భాగోతాలు లేవా? త్రాగి భార్యల్ని తంతూ బజారు స్త్రీల వెంబడి మీరు పడటంలేదా?...తెలివి తక్కువగా మాట్లాడి మమ్మల్ని బాధపెడితే మీకేమొస్తుంది?" రెండు చేతులతో మొగం కప్పుకుని వెక్కి వెక్కి యేడవసాగింది విపుల. నిర్ఘాంతపోయిన అక్కడి వాళ్ళెవరూ ఆమెను ఓదార్చే ప్రయత్నంకూడా చెయ్యలేదు.

# 25

ఇరవయినాలుగు గంటలయ్యేసరికి విపులాదేవి దివాలాతీసిన సంగతి బొంబాయి, మద్రాసు, హైద్రాబాద్ ఇండస్ట్రీలకి తెలిసిపోయింది....విపుల సర్వస్వమూ అయిన 'లాల్ దర్వాజా' పూర్తిగా కూలిపోయింది.

చాలామంది నిర్మాతలూ, విపుల విరోధులూ హాయిగా ఊపిరి పీల్చుకున్నారు. ఆ సినిమా సక్సెస్ అయితే మనసులో వున్న అసూయా ద్వేషాల్ని అణచుకొని ఆమెను ఆకాశానికెత్తే జనం ఈ రోజున ఆమెను అపహాసిస్తున్నారు. ఆమె సర్వనాశనాన్ని అందరూ విన్నాగాని ఆమెను పలకరించటానికి కూడా ఎవరూ రాలేదు. ఆనాటి నుంచి ఆమె హోటలు గదిలో మంచంమీద పడి ఉంది. ఆమె ఆరోగ్యంకన్నా ఆమె మనస్థితిని చూసి భయపడిన దాసీది చింతామణికి టెలిగ్రాం ఇచ్చింది.

ఇంకో అరగంటలో హైద్రాబాద్ నుంచి వస్తున్న విమానంలో ఆమె వస్తుందనగా విపులకి స్పృహ తప్పిపోయింది...ఇది తెలిసిన సావిత్రి మద్రాసునుంచి బయలుదేరింది. అప్పుచేసి విమానం టికెట్ కొనుక్కుని మరీను....ఆ రోజల్లా విపులకి ఫిట్సు వస్తూనే ఉన్నాయి.

చింతామణీ, సావిత్రీ, ఆమెను అనేకసార్లు పలకరించారు ... ఆమెకి తెలివి వచ్చినప్పుడు శూన్యంగా పైకప్పుని చూడటంతప్ప ఏ భావమూ కనిపించనంత గడ్డకట్టుకుపోయింది విపుల.

తన పినతల్లి ఒకావిడకి పిచ్చి ఎత్తి—ఆ పిచ్చికి ముందు ఆమెకూడా ఇలాగే ఉండేదన్న విషయం జ్ఞాపకమొచ్చింది చింతామణికి ...నిజంగా విపుల పిచ్చిదవుతుందా? తిండి తినదు. నిద్రపోదు. డాక్టర్ని అడిగితే ఫరవాలేదంటాడు.

సావిత్రి విపుల చెయ్యి తన చేతిలోకి తీసుకొంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది.

"విపీ....విపులా....ఇటు చూడు. చింతీ, నేనూ వచ్చాం. నీకేం భయం లేదు. ఒక్కసారి మా వంక చూడు........" అంది మెల్లిగా సావిత్రి.

విపుల చూపులో మార్పులేదు....ఆమె చెయ్యి మాత్రం సావిత్రి చేతిని గట్టిగా పట్టుకుంది.

"ఇటు చూడు విపులా....ఇటు చూడు....నీకు దేన్నిగురించి విచారమో కాస్త చెప్పు....దిక్కుమాలిన సినిమా ప్రాణంకంటే ఎక్కువ కాదుగా....ప్రాణంతో ఉంటే ఇలాటి సినిమాలు లక్షలు తియ్యవచ్చు. ఈ నష్టాన్ని భరించాలి కాని....నేనున్నాను, సావిత్రి ఉంది. నిన్ను ఒంటరిదాన్ని చెయ్యం...ఇంతకంటె మంచి సినిమా తీద్దాం...మనల్ని మనం బజారులో అమ్ముకునైనా సరే ఊపిరి పీల్చి బ్రతకటంలో సుఖం ఉంది...విపులా...ఇదంతా సర్దుకుంటుంది. బెంగ పడకు" అంది చింతామణి, ఏడుపు పైకి పొంగకుండా జాగ్రత్త పడుతూ.

విపుల చూస్తూనే ఉంది. కళ్ళు, తిరుగుతున్న ఫానుమీదే కేంద్రీ కరింపబడి ఉన్నాయి.

విపులని ఆ ఇద్దరూ ఎరుగుదురు. ఇప్పుడు తగిలింది పెద్ద దెబ్బే...దాని ప్రభావం ఆమెని తల ఎత్తుకోకుండా మాత్రం చెయ్య లేదు...దీనిలో తల పగలగొట్టుకోవాలిసిందేమీ లేదు—ఆమెకుగాని, చింతామణికిగాని, సావిత్రికిగాని కష్టాలూ, ఎదురు దెబ్బలూ కొత్తవీ కావు, అలవాటు లేనివీ కావు.

తమ చేతులో చిల్లి గవ్వలేకపోయినా త్రివేణిని నిర్మించు కొన్నారు...మనసులో ఏ మాలిన్యాలున్నాగాని వాటిని అధిగమించి మమతల్ని పెంచుకున్నారు.

"విపులా..."

ఆమె నుదుటిమీద చెయ్యివేసి మెల్లిగా పిలిచింది సావిత్రి— విపులలో కొద్దిగా కదలిక కలిగింది...అది గ్రహించిన చింతామణి "ఈ విధంగా అయిపోతే మన కెవరు దిక్కు చెప్పు...? మనం ధైర్యంగా ఉంటేనే బ్రతుకు. అధైర్యపడితే ఆరిపోతాం...బ్రతక టానికి అబద్ధాలాడదాం...అన్యాయం చేద్దాం...మిగిలిన కొద్దిపాటి స్త్రీత్వాన్ని మహానగరంలో తాకట్టు పెట్టయినా సరే బ్రతికే ఉందాం.

బ్రతకటంలో హాయి ఉంది. ఆనందం ఉంది...మన ముగ్గురం ఒకళ్ళ నొకళ్ళం అంటి పెట్టుకొని ఉందాం'' అంది.

చింతామణి మాటలు విపులలో మరికొద్ది సంచలనాన్ని కలిగించినయ్.

''సావిత్రికూడా సర్వాన్ని పోగొట్టుకొంది. దాన్ని ఓదార్చవూ?''

విపుల పెదవులు కదిలినయ్.''త్రి... వే...ణి...'' అన్నాయ్.

చింతామణి ఆమెరెండుచేతుల్ని గట్టిగాపట్టుకుని ''త్రివేణి పోతే పోయింది. మరో చతుర్వేణిని కట్టుకుందాం...నువ్వు చావకూడదు. బ్రతికే ఉండాలి...నాకు నాలుగు పిక్చర్సున్నాయ్. సావిత్రి కింకా చిన్ని ఇల్లు మిగిలేఉంది...మనం పతితలమే కావచ్చును. అసూయతో అప్పుడప్పుడు స్వార్థపరులం కూడా కావచ్చును. సుఖంలో ద్వేషించుకున్నా కష్టంలో ప్రేమించుకుందాం. కళ్ళు తెరువు విపులా... నేనున్నాను. సావిత్రి ఉంది. నువ్వున్నావు. మనలోఉన్న ప్రాణమే గంగ.,మనలో ఉన్న ప్రేమే యమున...మనలో ఉన్న మానవత్వమే సరస్వతి. చూడు విపీ...ఈ సంగమం కన్న పవిత్రమైనదీ లేదు. పావనమైనదీ లేదు నువ్వు బ్రతకాలి, బ్రతికి తీరాలి!'' అంది.

విపుల కళ్ళల్లోకి జీవం వచ్చింది...ఆమె ఆ ఇద్దర్నీ రెండు చేతుల్తో హృదయంమీద చేర్చుకుని గొణిగింది.

''త్రి... వే...ణి.''

# HLP "ఇంటింటా స్వంత గ్రంథాలయం" ప్రణాళిక సరికొత్తరూపంలో సమర్పణ!

## పాఠకుల సౌకర్యానికై సరికొత్త మార్పులు! సరికొత్త సదుపాయాలు!! సరికొత్త పద్ధతి!!




## ఎన్ని మార్పులు తెచ్చినా, ఎన్ని చేర్పులు చేసినా అందరికీ అందుబాటుగా వున్న మా చందా మొత్తంలో మార్పులేదు.



## ఈ వివరాలు పరిశీలించండి. మీకే తెలుస్తుంది.

| పాత హెచ్. ఎల్. పి. ప్రణాళిక | కొత్త హెచ్. ఎల్. పి. ప్రణాళిక | సమీక్ష |
|---|---|---|
| 3000 తెలుగు పుస్తకాలనుంచి మాత్రమే ఎన్నుకోవచ్చు. ఇంగ్లీషు పుస్తకాలు లేవు | 3200 తెలుగు పుస్తకాలేకాక 400 పైగా ఉన్న ఇంగ్లీషు పుస్తకాల నుంచికూడ ఎన్నుకోవచ్చు | మీయింటనున్న మీ స్వంత గ్రంథాలయానికి మరిన్ని కొత్తపుస్తకాలు. |
| పూర్తి చందా కట్టడానికి పూర్తి 18 నెలల [illegible] | 12 నెలల్లోనే చందా మొత్తం పూర్తవుతుంది | శీఘ్రతరమైన సదుపాయం. |
| చందా మొత్తం రు. 5 x 18 నెలలు = రూ. 90/- | చందా మొత్తం రు 7.50 x 12 నెలలు = రూ. 80/- | అందరికీ అందుబాటైన మొత్తం. మార్పులేదు. |




హెచ్. ఎల్. పి. చందాదారులు ఇన్నాళ్లూ పొందుతూ వచ్చిన ఉచిత పుస్తకాలూ, ఉచిత రవాణా సదుపాయాలూ, నెలనెలా 'పుస్తక ప్రపంచం', యావజ్జీవిత సదుపాయాలూ మొదలైనవాటిలో ఏవిధమైన మార్పులేదు.

ఇన్నాళ్లూ అపూర్వ జనాదరణ పొందిన 'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళికలో సభ్యులుగా చేరి 22,500 మందికిపైగా ఆంధ్రపాఠకులు తమ ఇళ్లలో స్వంత గ్రంథాలయాలు నెలకొల్పుకున్నారు.

ఇప్పుడు ఇస్తున్న సరికొత్త సదుపాయాలద్వారా మరిన్ని 'ఇంటింటా గ్రంథాలయాలు' వెలుస్తాయని ఆశిస్తున్నాం.